# సనత్సుజాతపర్వము

122

## ౧ అధ్యాయము-

ధృతరాష్ట్ర ఉవాచ-

తరాష్ట్రః ఉవాచ- ధృతరాష్ట్రుడు పలికెను-

అనుక్తం యది తే కించిద్వాచా విదుర విద్యతే।
తన్మే శుశ్రూషతో బ్రూహి విచిత్రాణీహ భాషసే॥౧॥

ర=విదురుడా, తే వాచా అనుక్తమ్=నీమాటచేత చెప్పబడని కించిత్ విద్యతే యది=ఏదైనను ఉన్నయెడను, శుశ్రూషతః =వినగోరుచున్న నాకు, తత్ బ్రూహి=దానిని చెప్పుము- ఇహ ) విచిత్రాణి భాషసే= ఇచ్చట (నీవు) విచిత్రములైనవానిని ప్పుచున్నావు-

తా॥ ఓవిదురుడా నీవిప్పటికి చెప్పగా మిగిలిన విచిత్రము వైననున్నయెడను చెప్పుము-

విదురఉవాచ

రః ఉవాచ=విదురుడు పలికెను.

ధృతరాష్ట్ర కుమారో వై యః పురాణః సనాతనః।
సనత్సుజాతః ప్రోవాచ మృత్యుర్నాస్తీతి భారత॥౨॥
స తే గుహ్యాన్ ప్రకాశాంశ్చ సర్వాన్ హృదయసంశయాన్।
ప్రవక్ష్యతి మహారాజ సర్వబుద్ధిమతాం వరః॥౩॥

రత= భరతవంశమువాడా, ధృతరాష్ట్ర = ధృతరాష్ట్రుడా, రాణః సనాతనః కుమారః=ప్రాచీనుడును ఎల్లప్పుడునుండువాడ ను కుమారుడునగు, యః సనత్సుజాతః=ఏ సనత్కుమారుడు, త్యుః నాస్తీతి ప్రోవాచ=మృత్యువు లేదని చెప్పెనో, మహారా ఓమహారాజా, సర్వబుద్ధిమతాం వరః సః=అందఱుబుద్ధిమంతుల నును శ్రేష్ఠుడగుఆసనత్కుమారుడు, గుహ్యాన్ ప్రకాశాంశ్చ= ఢములయినవియును ప్రకటములైనవియునగు, తే హృదయసంశ

యాన్ సర్వాన్ ప్రవక్ష్యతి=నీహృదయములోని సంశయము
న్నిటినిని చెప్పఁగలడు-

తా॥ ఓధృతరాష్ట్రుఁడా నాత్మకు మరణము లేదని చెప్పిన
త్సుజాతుఁడు, నీహృదయములోని సంశయములనన్నిటినితీర్పఁ

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు పలికెను

కిం త్వంన వేదతద్భూయో యన్మేబ్రూయాత్సనాతనః।
త్వమేవవిదురబ్రూహి ప్రజ్ఞాశేషోస్తి చేత్తవ॥౪॥

సనాతనః మే యత్ బ్రూయాత్=సనాతనుఁడయిన సనత్సు
డు నాకు దేనిని చెప్పునో, తత్ త్వం న వేదకిమ్=దానిని నీవు
గవా యేమి- తవ ప్రజ్ఞా శేషః అస్తి చేత్=నీకు ఆజ్ఞానపు సం
రము ఉన్నయెడను, విదుర త్వమేవ బ్రూహి=విదురుఁడా
చెప్పుము-

తా॥ ఓవిదురుఁడా ఆసనత్సుజాతుఁడు నీతోఁ జెప్పిన
నీవుమరవకుంటివేని నీవెనాకు చెప్పుము-

విదురఉవాచ=విదురుఁడుపలికెను-

శూద్రయోనావహం జాతో నాతోన్యద్వక్తుముత్సహే
కుమారస్యతుయాబుద్ధిర్వేదతాం శాశ్వతీమహామ్॥౫॥

అహంశూద్రయోనౌ జాతః=నేను శూద్రయోనిలో పుట్టినవా
అతః అన్యత్ వక్తుమ్ నోత్సహే=ఇందువలన మిగిలినదానిని చె
ఉత్సహింపను- చెప్పఁగోరననుట- కుమారస్య యాబుద్ధిః (
కుమారునకు ప్రజ్ఞానము (కలదో), శాశ్వతీమ్ తామ్ అహమ్
ద=శాశ్వతమైన ఆజ్ఞానమును నేను ఎఱుఁగుదును-

తా॥ సనత్కుమారుఁడెఱింగిన జ్ఞానమును నేను నెఱు
నుగాని శూద్రయోనిలోఁ బుట్టుటను నేను నీకుదానిం జెప్పఁ

బ్రాహ్మీంహి యోనిమాపన్నః సుగుహ్యమపి యోవదేత్
న తేనగర్హ్యో దేవానాం తస్మాదేతద్బ్రవీమి తే॥౬॥

బ్రాహ్మీం యోనిమ్ ఆపన్నః యః=బ్రాహ్మణసంబంధియగు జన
పొందిన యెవ్వఁడు, సుగుహ్యమపి వదేత్ (యది)=మిక్కిలి ర
మైనదానిగూడ చెప్పునేని, తేన (సః) దేవానాం గర్హ్యః న(

దానిచేత (వాఁడు) దేవతలకు నిందాపాత్రుఁడు కాఁడు- తస్మాత్ ఏతత్ తే బ్రవీమి=అందువలన దీనిని నీకు చెప్పితిని-

తా॥ బ్రాహ్మణజన్మము నెత్తిన వాఁడు ఎంతరహస్యమును ఉపదేశించినను దేవతలువానిని నిందింపరు- ఇతరుఁడు ఉపదేశించినచో నిందింతురు- కావుననే నేను చెప్పఁజాలనని నీతోఁ జెప్పితిని-

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు పలికెను-

బ్రవీహి విదుర త్వం మే పురాణం తం సనాతనమ్।
కథమేతేన దేహేన స్యాదిహైవ సమాగమః॥ ౭॥

విదుర=విదురుఁడా, త్వం పురాణం సనాతనం తం మే బ్రవీహి=నీవు పాతవాఁడును ఎల్లప్పుడును ఉండువాఁడునగు అతనితో నాకొఱకు చెప్పుము- ఏతేన దేహేన ఇహైవ సమాగమః=ఈ దేహముతో ఇచ్చటనె సమాగమము, కథం స్యాత్=ఎట్లుకలుగును,

తా॥ ఓ విదురుఁడా ఈదేహముతో నేనిచ్చటనేయుండఁగా ఆసనత్సుజాతునితో నేనుకలిసికొనునట్లు నీవుఆయనతోఁ జెప్పవలయును-

వైశమ్పాయన ఉవాచ=వైశంపాయనుఁడు చెప్పెను-

తా॥ ధృతరాష్ట్రుఁడిట్లు చెప్పినపైని విదురుఁడేమి చేసెనో ఆయంశమును వైశంపాయనుఁడు జనమేజయునితో చెప్పెను-

చిన్తయామాస విదురస్తమృషిం శంసితవ్రతమ్।
స చ తచ్చిన్తితం జ్ఞాత్వా దర్శయామాస భారత॥ ౮॥

విదురః శంసితవ్రతమ్ తమ్ ఋషిం చిన్తయామాస=విదురుఁడు స్తోత్రము చేయఁబడినవ్రతముగల ఆ ఋషిని తలంచెను. (హే) భారత=(ఓ) భరతవంశమువాఁడా (జనమేజయుఁడా), సః తత్ చిన్తితం జ్ఞాత్వా=అతఁడు ఆ తలంపును తెలిసికొని, (ఆత్మానం) దర్శయామాస=(తన్ను) చూపించుకొనెను

తా॥ ఇట్లుధృతరాష్ట్రుఁడు చెప్పినతోడనె విదురుఁడు సనత్కుమారుని మనస్సున తలంచెను. ఆతలంపును తెలిసికొనిన ఆసనత్కుమారుఁడుతత్క్షణమె అచ్చట దర్శనమిచ్చెను-

స చైనం ప్రతిజగ్రాహ విధిదృష్టేన కర్మణా।

సుఖోపవిష్టం విశ్రాన్త మథైనం విదురో బ్రవీత్ ॥౯॥

సచ విధిదృష్టేన కర్మణా ఏనం ప్రతిజగ్రాహ=ఆధృతరాష్ట్రుఁడును శాస్త్రములోఁగనఁబడిన చొప్పున ఈతనిని ఎదుర్కొనెను అథ=తరువాతను, సుఖోపవిష్టం విశ్రాన్తమ్ ఏనమ్=సుఖంబునఁ గూర్చున్నవాఁడును విశ్రమించినవాఁడునగు ఈతనితో, విదురః అబ్రవీత్=విదురుఁడు పలికెను-

తా॥ ఇట్లు సనత్సుజాతుఁడు దర్శనమిచ్చిన తోడనె ధృతరాష్ట్రుఁడతని నెదుర్కొని అర్ఘ్యపాద్యాదులనిచ్చెను-కొంతసేపు విశ్రమించిన తరువాత విదురుఁడు అతనితో నిట్లనియె-

భగవన్ శంసయః కశ్చిద్ధృతరాష్ట్రస్యమానసః।
యోనశక్యోమయా వక్తుం త్వమస్మైవక్తుమర్హసి॥౧౦॥

(హే)భగవన్=(ఓ)భగవంతుఁడా, ధృతరాష్ట్రస్య యః కశ్చిత్ మానసః(అస్తి)=ధృతరాష్ట్రునకు ఏదో యొక మనస్సునందలిసందేహము (కలదు)-(తం) శంస=(దానిని) చెప్పుము-యః మయా వక్తుం నశక్యః=ఏది నా చేత చెప్పఁబడ శక్యముకానిదో-అస్మై త్వమ్ వక్తుమ్ అర్హసి=ఈతనికి నీవు చెప్పను తగుదువు-

తా॥ ధృతరాష్ట్రునకొక్క సందేహముకలదు-దానిని నేను తీర్పంజాలను-కాఁబట్టి ఆతనికి నీవు చెప్పవలయును-

యంశ్రుత్వాఽయంమనుష్యేంద్రః సర్వదుఃఖాతిగోభవేత్।
లాభాలాభౌప్రియద్వేష్యౌయథైనం నజరాన్తకౌ॥౧౧॥
విషహేరన్ భయామర్షౌ క్షుత్పిపాసేమదోద్భవౌ।
అరతిశ్చైవతన్ద్రీశ్చ కామక్రోధౌక్షయోదయౌ॥౧౨॥

యంశ్రుత్వా=దేనిని విని, అయం మనుష్యేన్ద్రః=ఈరాజు, సర్వదుఃఖాతిగః భవేత్=అన్నిదుఃఖములను నతిక్రమించువాఁడు అగుచున్నాఁడో, లాభాలాభౌ ప్రియద్వేష్యౌ జరాన్తకౌ=లాభనష్టములును ఇష్టానిష్టములును ముదిమిచావులును, భయామర్షౌ క్షుత్పిపాసే మదోద్భవౌ=భయక్రోధంబులును ఆకలిదప్పికలును మదగర్వంబులును,

8-10-1895

అరతిశ్చైవ తంద్రీశ్చ కామక్రోధౌ క్షయోదయౌ — అరతియును బద్ధకంబును కామక్రోధంబులును కీడుమేలులును, ఏనం యథా నాభిహరేత్ — ఈతనిని ఎట్లు తిరస్కరింపఁజాలన్నో.

తా. ఈధృతరాష్ట్రుఁడు సర్వదుఃఖములను దాఁటునట్లును ఈతనికి ద్వంద్వములు బాధింపనియట్లును నీవు పరమార్థమును ఉపదేశింపవలయును.

౧౨ శ్లోకమునకు, విషహేత మనోన్మాదౌ క్షుత్పిపాసే భయాభయే। అరతించైవ తంద్రీంచ కామక్రోధౌ క్షయోదయౌ, అని శంకరభాష్యపాఠము.

ఈ పాఠమున రెండు శ్లోకములకును పదార్థమెట్లన్నను—
అయం మనుష్యేంద్రః యం శ్రుత్వా సర్వదుఃఖాతిగః భవేత్ — ఈ రాజు దేనిని విని అన్నిదుఃఖములను అతిక్రమించినవాఁడు అగునో; ఏనం జరాంతకౌ యథా న (బాధేయాతామ్) = ఈతనిని ముదిమియును మరణమును ఎట్లు (బాధింపవో), అయమ్ = ఈతఁడు, లాభాలాభౌ ప్రియద్వేష్యౌ మనోన్మాదౌ క్షుత్పిపాసే భయాభయే = లాభమును లాభములేకపోవుటను ఇష్టమును అనిష్టమును మత్తెక్కుటను వెఱ్ఱినిని ఆకలిని దప్పికను భయమును భయము లేకపోవుటను, అరతించైవ తంద్రీంచ కామక్రోధౌ క్షయోదయౌ యథా విషహేత = అరతిని బద్ధకమును కామక్రోధములను కీడుమేలులను ఎట్లు సహించునో.

ఈయధ్యాయము శంకరభాష్యమున ప్రతిశ్లోకముగా వ్యాఖ్యానము చేయఁబడలేదు. మొత్తముగా వ్యాఖ్యానము చేయఁబడినది. దానిలోని యంశము క్రింద తెలియఁజేయఁబడును.

ఆత్మ స్వతస్సిద్ధముగా చిదానందాద్వితీయ బ్రహ్మమె. అనఁగా జ్ఞానానందస్వరూపమై రెండవది లేని బ్రహ్మమే. అయినప్పటికిని అవిద్యవలన బ్రహ్మమె యాత్మయనెడి జ్ఞానములేక దేహాదులె ఆత్మలని తోచి పురుషార్థములకు చెడుటయు అనర్థములు కలుగుటయు సంభవించెను. అవిద్య, కామము అనఁగా కోరిక, కర్మము, వీని చేత కల్పించికొనఁబడిన సాధనముల చేతనె తన యిష్ట

మును సంపాదించికొనుటకును అనిష్టములను నివారించికొనుటకు
ను చూచును- ఇట్లు లౌకిక సాధనములును వైదికకర్మములును చే
సినను పరమపురుషార్థమైన మోక్షమును పొందలేక మొసళ్లు ఈ
డ్చినట్లు రాగద్వేషాదులు వీనిని ఇటు అటు ఈడ్వగా దేవమను
ష్య పశ్వాది జన్మములఁ బొందుచు మఱియింత మోహమును జెం
దుచు సంసారమును పొందుచుండును- ఇట్టివాఁడు ఎట్టకేలకు
పుణ్యవశమున వేదమునఁ జెప్పఁబడిన యీశ్వరార్థములగు కర్మ
ములను ఆచరింపుచుండుటచేత రాగాదిదోషములు పోయి ఐహికఫ
లములును ఆముష్మికఫలములును గూడ ననిత్యాది దోషములతోఁ
గూడినవియెయని తెలిసికొని ఆరెండింటియందును వైరాగ్యముకల
వాఁడగును- ఆవెనుక వేదాంతములవలన ననఁగా నుపనిషత్తులవల
నఁ దెలియఁబడెడి బ్రహ్మాత్మభావమును అనఁగా బ్రహ్మమె తానగు
టను తెలియఁగోరును- అటపైని వేదమునఁ జెప్పఁబడిన శమద
మాది సాధనసంపత్తి కలవాఁడై బ్రహ్మజ్ఞుఁడగు నాచార్యుని చే
రును- ఆయాచార్యుని నాశ్రయించి వేదాంతములను అనఁగా ఉప
నిషత్తులను చదివికొని తానెబ్రహ్మమనెడి తత్త్వమును తెలిసికొనును-
దానివలన నజ్ఞానంబును అజ్ఞానకార్యంబులును గూడ పోయితాను
బ్రహ్మమె యయి యుండునని వేదాంతసిద్ధాంతము- ఇదియె క్ర
మమున సనత్సుజాతునిచేత తెలియఁజేయఁబడును- ధృతరా
ష్ట్రుఁడు దుఃఖము మోహము వీనితోఁగూడిన వాఁడై, ఆత్మజ్ఞాన
ముకలవాఁడు దుఃఖమును దాఁటును అని తెలియఁజేసెడి (ఛా॥
౭॥౧॥౩) తరతిశోక మాత్మవిత్ అనెడ వేదాంతవాక్యమును వి
ని బ్రహ్మవిద్యలేక శోకమును పోఁగొట్టుకొనుట యశక్యమని తలం
చుచు అనుక్తం యదితే కించిత్ (అ౧॥౧శ్లో) అనెడి శ్లోకముచేత
విదురునిఁ గూర్చి ప్రశ్నము చేసెను- పరమకారుణికుఁడైన విదురుఁ
డు సర్వజ్ఞుఁడయినను బ్రహ్మవిద్యకు అందఱును అధికారులు కార
నియు తగువారె యధికారులనియును తలంచి, శూద్రయోనా వ
హంజాతో నాతోన్యద్వక్తు ముత్సహే (౧అ॥ ౫శ్లో) అనిశూద్ర
యోనిలోఁబుట్టుటను ఉపనిషత్తులలోఁ జెప్పఁబడెడి బ్రహ్మాత్మజ్ఞాన

మునకు నేను అధికారిని కాను అని చెప్పి, ఈకృతరాష్ట్రుని పరమపదమయిన పరమాత్మయందు చేర్చుట యెట్లని యాలోచించి ఛాందోగ్యోపనిషత్తులోని యితిహాసమును అనఁగా భూమవిద్యలో నారదుఁడు సనత్సుజాతుని యొద్దకుఁబోయి ఆత్మజ్ఞానమును తెలిసికొని తరించెనను దానిని తలంచి, భూమశబ్దముచేఁ జెప్పఁబడు వాఁడును అవిద్యకు పైవాఁడునగు పరమాత్మను తెలియఁజేయుటకు సమర్థుఁడు సనత్సుజాతుఁడె కాని మఱియొక్కఁడు కాఁడని యాలోచించి, ఆ భగవత్సనత్సుజాతునినే యోగబలముచేత రప్పించి ఎదుర్కొని గౌరవించి, భగవన్ సంశయః కశ్చిత్ (౧అ॥ ౧౦- ౧౧-౧౨- శ్లో) ఇత్యాదిశ్లోకత్రియముచేత, స్వామీ ఈతఁడు సంసారమునకంతటికిని కారణములగు ధర్మాధర్మములు లేనివాఁడై దుఃఖములనన్నిటిని దాఁటి ముక్తుఁడగుటకు తగిన యుపదేశమును ఈతనికిఁ జేయుమని చెప్పెను. అని శంకరభాష్యము.

ఇత్యుద్యోగపర్వాంతర్గత సనత్సుజాతపర్వణి విదురప్రార్థనే చత్వారింశోఽధ్యాయః.

శ్రీ ఉద్యోగపర్వములోఁ జేరిన సనత్సుజాతపర్వంబున విదురప్రార్థనములో నలుబదియవ యధ్యాయము ముగిసెను.

# సనత్సుజాతపర్వము.

౧ అధ్యాయము-

వైశమ్పాయన ఉవాచ= వైశంపాయనుండు చెప్పెను-

తతోరాజా ధృతరాష్ట్రోమనీషీ
సంపూజ్యవాక్యం విదురేరితంతత్ ।
సనత్సుజాతం రహితేమహాత్మా
పప్రచ్ఛబుద్ధిం పరమాంబుభూషన్ ।౧।

తతః=తరువాతను, మనీషీ రాజా మహాత్మా ధృతరాష్ట్రః= పండి
తుఁడును రాజును మహాత్ముండునగు ధృతరాష్ట్రుఁడు, విదురేరితం త
త్ వాక్యం సంపూజ్య= విదురునిచేత చెప్పఁబడిన ఆ వాక్యమును
గౌరవించి, పరమాం బుద్ధిం బుభూషన్ = గొప్పజ్ఞానమును పొం
దఁగోరినవాఁడై, సనత్సుజాతం రహితే ప్రపచ్ఛ=సనత్సుజాతుని ర
హస్యమున ప్రశ్నము చేసెను-

తా॥ విదురుఁడు చెప్పినదాని నంగీకరించి జ్ఞానోపదేశమ
నుపొందుటకై సనత్సుజాతుని అడుగనారంభించెను-

సనత్సుజాతశబ్దార్థం బేమన్నను సనత్ అనునది బ్రహ్మ
చెప్పును- బ్రహ్మవలన, సుజాతః= లెస్సగాఁబుట్టినవాఁడు అనఁగా
జ్ఞానవైరాగ్యములతోఁ గూడఁబుట్టినవాఁడు- ఈతఁడే సనత్కు
మారుఁడు- అని శంకరభాష్య విగ్రహము- నీలకంఠీయమున, స
త్= ఎల్లప్పుడును, సు= లెస్సయైన, జాతః= పుట్టుక కలవాఁడు- అన
గా ఎల్లప్పుడును చిన్నపిల్లవానివలెనె యుండును గాన ముదిమిచా
ు లేనివాఁడనుట, అని విగ్రహము వ్రాయంబడినది- రహితే= లే
చోటను, అనఁగా పామరులు లేనిచోటననుట. మహాత్మయనఁగా గొ
ప్పబుద్ధిమంతుఁడనుట- బుభూషన్ అనుశబ్దము- భూ ప్రాప్తౌ ఆత్మనే
దీ అను ధాతువుమీదఁబుట్టినది- బుభూషమాణః అనియుండవలసినదా
నికి బుభూషన్ అనియుండుట ఆర్షప్రయోగము- పరబుద్ధియనఁగా
పరవిద్య-

నీలకంఠీయమున, మహాత్మా బుభూషన్ = పరబ్రహ్మముకా

10-10-1895

గలవాఁడై, అని యన్వయింపఁబడినదీనిచేత బ్రహ్మజ్ఞానమువలనఁ గలిగెడి బ్రహ్మభావమనెడి ప్రయోజనము చెప్పఁబడెననియును, పరమాం బుద్ధిమ్ అనుటచేత పరవిద్యయనెడి విషయము చెప్పఁబడెననియును, వివరింపఁబడినది.

ధృతరాష్ట్ర ఉవాచ — ధృతరాష్ట్రుఁడు పలికెను.

సనత్సుజాత యదిదం శృణోమి
నమృత్యురస్తీతి తవోపదేశమ్।
దేవాసురా హ్యాచరన్ బ్రహ్మచర్య
మమృత్యవే తత్కతరన్ను సత్యమ్ ॥ ౨॥

హే సనత్సుజాత = ఓ సనత్సుజాతుఁడా!, తవ యదిదమ్ ఉపదేశం శృణోమి = నీయొక్క ఏ యీ యుపదేశమును వినుచున్నానో, (తత్) మృత్యుః నాస్తీతి=(అది) మృత్యువు లేదనునదియె. దేవాసురాః అమృత్యవే బ్రహ్మచర్యమ్ ఆచరన్ = దేవాసురులు మృత్యువు లేకపోవుటకై బ్రహ్మచర్యమును ఆచరించిరి. కతరత్ను సత్యమ్=ఏది సత్యము.

తా॥ మృత్యువు లేదని నీవు శిష్యులకు ఉపదేశించినట్లు విదురుఁడు నాతోఁ జెప్పగా వింటిని. దేవాసురులు మృత్యువు లేకపోవలయు నని కోరి బ్రహ్మచర్యము నాచరించిరి గదా. మృత్యువు లేదను నీపక్షము ఎట్లు కుదురును? మృత్యువు కలదు, లేదు, అను పక్షములలో ఏది సత్యమో చెప్పుము.

దేవాసురులు 3౨ సంవత్సరములు బ్రహ్మచర్యము నాచరించినట్లు ఛాందోగ్యోపనిషత్తునఁ (౮॥ ౭॥ 3) జెప్పఁబడినది.

నీలకంఠీయమున మృత్యువనఁగా జన్మమరణ ప్రవాహరూపమయిన బంధము, అనఁగా సంసారము అని వివరింపఁబడినది.

సనత్సుజాత ఉవాచ = సనత్సుజాతుఁడు పలికెను.

అమృత్యుః కర్మణా కేచిన్మృత్యుర్నాస్తీతి చాపరే।
శృణు మే బ్రువతో రాజన్ యథైతన్మా విశఙ్కిథాః ॥ 3॥

కర్మణా అమృత్యుః (భవతీతి) కేచిత్ (ఆహుః)= కర్మముచేతమృత్యువు లేకపోవుట (కలుగునని) కొందఱు (చెప్పుదురు). అపరే

మృత్యుః నాస్తీతి (ఆహుః) = మఱికొందఱు మృత్యువు లేదని
చెప్పుచున్నారు)- ఏతత్ యథా = ఇది ఎట్లో, (తథా) బ్రువతః
(వాక్యం) శృణు = (ఆప్రకారము) చెప్పుచున్న నా (మాటను)
నుము. మావిశఙ్కథాః = సందేహింపకుము-

తా॥ కర్మములనాచరించుటచేత మృత్యువు లేకుండునని
ందఱు చెప్పుదురు- మృత్యువే లేదని మఱికొందఱు చెప్పుదురు - ఈ
ండు పక్షములకును విరోధము లేదను నంశమును నేను చెప్పెదను-
నుము- విరుద్ధములైన వానికి విరోధము లేకుండుటను ఈతఁ డెట్లు చె
నని శంకింపఁబోకుము-

మృత్యువు లేదనువారు ఇద్దఱు- అజ్ఞానులును విషయాసక్తు
ను- అందు అజ్ఞానులు మృత్యువు సత్యముగాకలుగుననుకొని అ
మృతత్వము కలుగుటకు వేదోక్తకర్మముల నాచరింతురు- రెండవ
రు విషయానుభవముతప్ప వేఱుమోక్షము లేదనుకొని కర్మము
నాచరించుటచేత దేవత్వము మొదలగుదానిని పొందియుండుటయె
మోక్షమనితలంచెదరు- వీరు చెప్పెడిశ్లోకము గూడనొక్కటికలదు-
॥ అపిబృన్దావనేశూన్యే సృగాలత్వం సఇచ్ఛతి। నతునిర్విష
మోక్షంగన్తుం దాచిదపిగౌతమ॥ అని- ఓగౌతముఁడా వాఁడుఅనఁ
బుద్ధిగలవాఁడు వట్టిదయినబృందావనమున నక్కగానుండుటనైన
గోరునుగాని విషయానుభవము లేని మోక్షమునుఒక్కప్పుడైన
కోరఁడు అనిశ్లోకార్థము- పరమాత్మతప్ప రెండవది లేదనియెడి
రు కొందఱు అనఁగా భాస్కరమతస్థులు జ్ఞానకర్మములు రెం
ను మోక్షమును గలుగఁజేయుననియెదరు- ఇఁకనద్వైతులో ఆత్మత
రెండవది లేదనుచున్నవారై మృత్యువె లేదనియెదరు- అని శంకర
ప్యము.

శరీరమె యాత్మయనుకొనువారు కర్మములనాచరించి మ
ము నిత్యమైన శరీరమును సంపాదించికొనవలయు ననుకొనియెద
- శరీరముగాక ఆత్మ వేఱుగానున్నదని యెఱింగినజ్ఞానులు ఆత్మ
నాశము లేదుగాన ఆత్మకుమరణము లేదని తెలిసికొనియెదరు- అని
విశిష్టాద్వైతవ్యాఖ్యానము-

ఉభే సత్యే క్షత్రియాద్య ప్రవృత్తే
మోహో మృత్యుస్సమ్మతోయం కవీనామ్।
ప్రమాదం వై మృత్యుమహం బ్రవీమి
తథాఽప్రమాదమమృతత్వం బ్రవీమి ॥౪॥

హే క్షత్రియ = ఓ క్షత్రియుఁడా!, ఆద్యప్రవృత్తే ఉభే సత్యే = మొదటినుండి జరుగుచున్న రెండు పక్షములును సత్యములు- మోహః అయం మృత్యురితి కవీనాం సమ్మతః = మోహమె ఈమృత్యువని బుద్ధిమంతులకు ఇష్టము- అహం ప్రమాదం మృత్యుం బ్రవీమి వై = నేను ప్రమాదమును మృత్యువును గాను చెప్పుచున్నానుగదా- తథ అప్రమాదమ్ అమృతత్వం బ్రవీమి = అట్లె ప్రమాదము లేకపోవుటను అమృతత్వమును గాను చెప్పుచున్నాను-

క్షత్రియాద్య, ప్రవృత్తే అనిగూడ పదచ్ఛేదము చేయవచ్చును- అప్పుడు (క్షత్రియాద్య) క్షత్రియ శ్రేష్ఠుఁడా! (ప్రవృత్తే) లోకమున వ్యవహరింపఁబడియున్న ఈ రెండు పక్షములును సత్యములు అనియోజన చేయవలయును.

తా॥ మృత్యువు ఉన్నదనుటయు లేదనుటయు గూడ సత్యములె. పామరులును జ్ఞానులును సృష్ట్యాదినుండి కలిగియుండుటను ఈ రెండును సృష్ట్యాదినుండియు వ్యవహరింపఁబడుచున్నవి- మోహమే మృత్యువని బుద్ధిమంతుల తాత్పర్యము- నేను ప్రమాదము నేకదా మృత్యువని చెప్పుచున్నాను- ప్రమాదము లేకపోవుటయె అమృతత్వ మని చెప్పుచున్నాను-

మోహ మనఁగా మిథ్యాజ్ఞానము- అనఁగా ఆత్మ కానిదానిని ఆత్మయనుకొనుట- అదిమృత్యువని కొందఱి తాత్పర్యము- ప్రమాద మనఁగా తాను బ్రహ్మమైయుండుటనుండి తప్పిపోవుట- ఇది ఆమిథ్యాజ్ఞానమునకుఁగూడ కారణము- అది తానెవ్వఁడో ఎఱుంగకపోవుటయె- ఆత్మాజ్ఞానము మృత్యువని ఫలితార్థము- అదియె జననమరణాదిస్వరూపములయిన యనర్థములన్నిటికిని కారణము- తానె పరబ్రహ్మమైయుండుట అప్రమాదము- అదియె అమృతత్వము- అదియె మోక్షము- ఇట్లు తనస్వరూపమున తానుండుటయె మోక్షము

గాన అది కర్మమువల్ల సంపాదింపఁబడఁదగిన ఫలము కాదు- కర్మముతోఁగూడిన జ్ఞానమువలన సంపాదింపఁబడవలసినదియును కాదు- వ్యక్తిజ్ఞానమువలన కలుగునదియె. అని శంకరభాష్యము.

ఇచ్చట మోహమన్నను ప్రమాదమన్నను దేహాత్మాభిమానమె- కవులనఁగా పరావరతత్త్వముల నెఱింగిన మహర్షులు- వారు చెప్పుదాసినె నేనును జెప్పుచున్నాను. అప్రమాదమనఁగా దేహాత్మవివేకము - దేహాత్మాభిమానము గలవానికి మృత్యువే తటస్థించుచుండునుగాని మోక్షము సంభవింపదు- దేహాత్మవివేకము గలవారలకు ఈశరీరమునకు నాశము కలిగినను ఆత్మ యుండునుగాన వారలు మోక్షసాధనముల నాచరించి మోక్షమును సంపాదించికొనవచ్చును-అనివిశిష్టాద్వైతవ్యాఖ్యానము-

ప్రమాదాద్వైవ్యా సురాః పరాభవ
న్నప్రమాదాద్బ్రహ్మభూతాస్సురాశ్చ।
నవైమృత్యుర్వ్యాఘ్ర ఇవాత్తిజన్తూ
న్నాప్యస్యరూపము పలభ్యతేహి ॥౫॥

అసురాహి ప్రమాదాత్ పరాభవన్ వై= అసురలు ప్రమాదమువలన పరాభవమును పొందిరిగదా- సురాశ్చ అప్రమాదాత్ బ్రహ్మభూతాః (అభవన్) = సురలు ప్రమాదములేకపోవుటవలన పరిశుద్ధాత్మలయినవారు (అయిరి)- మృత్యుః వ్యాఘ్ర ఇవ జన్తూన్ నాత్తి వై = మృత్యువు పెద్దపులివలె జంతువులను తినదుగదా. అస్య రూపమపి నహ్యుపలభ్యతే= దీనికి ఆకారముగూడ కనబడకున్నదిగదా.

తా॥ దేహమే ఆత్మయనుకొని అసురలు చెడిరిగదా- దేవతలు అట్టిభ్రాంతి లేకపోవుటను మోక్షమును పొందిరిగదా- మృత్యువనునది యొకట్టి పులివలె మనుష్యులమీదఁ బడితినుటలేదు- అట్లుతినునేని దానియాకారమును అందఱును చూచుచునే యుందురు-

అప్రమాదమనఁగా స్వాభావికముగా తానుసచ్చిదానందాద్వితీయబ్రహ్మముగానుండుట-విరోచనుఁడు మొదలగువారుఅసురలు. ఇంద్రుఁడు మొదలగువారు సురలు.అసురసుర శబ్దములకు పామరులుజ్ఞాను

లు అనియునర్థము చెప్పవచ్చును- అప్పుడు అసురశబ్దమునకును సుర శబ్దమునకును (అసు) ప్రాణములయందు అనఁగా ఇంద్రియములయందె (ర) క్రీడించువారు అనఁగా ఆనందమునుపొందువారు అనియును, (సు=స్వ) ఆత్మయందె(ర) క్రీడించువారు అనియును అవయవార్థములు- ఇందుకుశ్లోకము- అన్యత్రైవరతిర్యేషాం స్వస్మిన్ బ్రహ్మణి చాచలే। తేసురా ఇతివిఖ్యాతా స్సూరయశ్చసురామతాః అసి-తనయందు అనఁగా ఆత్మయైనిశ్చలుఁడైనపరబ్రహ్మమునందు ఎవ్వారికిఆనందము కలదో వారుసురులని ప్రసిద్ధులైరి- సురులనువారెసూరులని చెప్పఁబడుచున్నారు- అనియీశ్లోకమునర్థము- అనిశంకరభాష్యము-

యమం త్వేకె మృత్యుమతోన్యమాహు
రాత్మావాస మమృతం బ్రహ్మచర్యమ్।
పితృలోకే రాజ్యమనుశాస్తి దేవః
శివశ్శివానా మశివోశివానామ్॥౬॥

ఆత్మావాసమ్ అమృతమ్ బ్రహ్మచర్యమ్ యమమ్- ఆత్మలయందుండువాఁడును మరణములేనివాఁడును బ్రహ్మనిష్ఠగలవాఁడునగు యముని, ఏకె అతః అన్యమ్ మృత్యుమ్ ఆహుః=కొందఱు దీనికంటె నితరమైన మృత్యుదేవునిగా చెప్పుదురు- (సః) దేవః పితృలోకే రాజ్యమ్ అనుశాస్తి-(ఆ)దేవుడు పితృలోకమున రాజ్యమును పరిపాలింపుచున్నాడు- శివానాం శివః(భవతి)-మంచివారలకు మంచివాఁడు (అగుచున్నాఁడు)- అశివానామ్ అశివః భవతి-చెడ్డవారలకు చెడ్డవాఁడు అగుచున్నాఁడు-

తా॥ అజ్ఞానులు ఈప్రమాదముగాక యముఁడను దేవుఁడె మృత్యువనియును అతఁడు పితృలోకపురాజనియును, మంచిపనులు చేసినవారలకు మంచివాఁడనియును చెడ్డపనులు చేసినవారిని శిక్షించువనియును చెప్పెదరు- వస్తుస్థితిని బట్టిచూచినచో అందఱి హృదయములయందునుండెడి పరమాత్మయెయముఁడు- పరమాత్మయెయముఁడను నంశమును మనువుకూడ చెప్పియున్నాఁడు- శ్లో॥ యమోవైవస్వతో రాజాయస్త్వైవహృదిస్థితః। తేనచేదవివాద-స్తేమాగఙ్గాం మాకురూన్ గమః- అని-యముఁడనియు వైవస్వతుఁడనియు రాజనియు

చెప్పఁబడుచున్నవాఁడు నీహ్వాయమునందె యున్నవాఁడు- అతనితో నీకు వివాదములేదే వని నీవు గంగాస్నానమును చేయనక్కఱలేదు, కురుక్షేత్రయాత్రి చేయనక్కఱలేదు- అనియీశ్లోకము తాత్పర్యము-

సావిత్ర్యుపాఖ్యానమున మృత్యువు కానంబడినయట్లు చెప్పియున్నదే అని శంకించికొని ఈశ్లోకమును చెప్పుచున్నాఁడు- యముఁడను మృత్యుదేవత సాక్షాత్తుగా మృత్యువుకాఁడు- ప్రమాదమనెడి యజ్ఞానమే చెడఁగొట్టునదిగాన సాక్షాత్తుగా మృత్యువు- ఇహా చే దవేదీ దథ సత్య మస్తి నచేదిహావేదీ న్మహతీ వినష్టిః (కేనో॥ ౨ఖ॥ ౫మ॥)ఇహా అవేదీచ్చేత్ అథ సత్యమ్ అస్తి =ఇచ్చట తెలిసికొనెనేని అటపైని సత్యము కలదు, ఇహా నావేదీచ్చేత్ మహాతీ వినష్టిః (అస్తి)= ఇచ్చట తెలిసికొనఁడేని గొప్ప నష్టము (కలదు) అనిశ్రుతికూడఁ జెప్పుచున్నది- అజ్ఞానే నావృతంజ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః (జ్ఞానమ్ అజ్ఞానేన ఆవృతమ్= జ్ఞానము అజ్ఞానముచేత ఆవరింపఁబడినది- తేన జన్తవః ముహ్యన్తి= దానిచేత జంతువులు మోహముగలవగుచున్నవి- జంతువులనఁగా మనుష్యాదులు-) అని భగవద్గీతలలో(౫॥౧౫) జెప్పఁబడినది- ప్రమాదమే మృత్యువును అప్రమాదమే అమృతత్వము అనఁగా మోక్షమునుగాన మోక్షము కర్మసాధ్యముకాదు- కావుననే తమేవ విదిత్వాఽతిమృత్యుమేతి నాన్యః పన్థా విద్యతేఽయనాయ (శ్వే॥౬అ॥ ౧౫మ॥ తం విదిత్వైవ మృత్యుమ్ అత్యేతి=అతనిని తెలిసికొనియె మృతువ్యును దాఁటుచున్నాఁడు- అయనాయ అన్యః పన్థాః నవిద్యతే=మోక్షమునకు మఱియొకఁ మార్గము లేదు-) అనిశ్రుతికూడఁ జెప్పుచున్నది- కర్మణాబధ్యతే జన్తుర్విద్యయాచ విముచ్యతే। తస్మాత్కర్మ నకుర్వన్తి యతయః పారదర్శినః (మనుష్యుఁడు కర్మముచేత బంధమును పొందును- జ్ఞానముచేత మోక్షమును జెందును- కావుననే అద్దరింగాంచిన యతులు కర్మమును చేయరు) అని మోక్షధర్మమున చెప్పఁబడినది- అట్లైనచోఁ గర్మములం జేయనక్కఱలేదే యన్నను— అట్లుకాదు- జ్ఞానము కలిగినవాఁడు కర్మములనాచరింప నక్కఱలేదుగాని జ్ఞానములేనివాఁడును జ్ఞానపుమెట్లను ఎక్కఁబోవువాఁడును ఆచరింపవలసి

నదే- కర్మములు బంధహేతువులేమో యన్నను, ఫలముం గోరి చేసిన
చో బంధహేతువులగును- అట్లు కాక ఈశ్వరార్థముగా చేసినయె
డను చిత్తశుద్ధిని కలుగఁజేయును- కావుననే, తపసా కల్మషం హన్తి
విద్యయామృతమశ్నుతే(తపస్సుచేత కల్మషమును పోఁగొట్టుకొను
ను- విద్యచేత మోక్షముఁ జెందును) అని మనువు చెప్పియున్నాఁడు-
చిత్తశుద్ధి కలిగినఁగాని జ్ఞానము కలుగదు- జ్ఞానము కలిగినంగాని మోక్ష
ము కలుగదు- ఇట్లు యజ్ఞదానాదులచేత విశుద్ధచిత్తుఁడై ఐహికములగు
పుత్రపశ్వాది ఫలములయందును ఆముష్మికములయిన స్వర్గాదిఫలముల
యందును వైరాగ్యముకలవాఁడై యోగారూఢుఁడగువానికి శమమె
కార్యకరముగాని కర్మము కార్యకరముగాదు- యోగానుష్ఠానమెట్లు
చేయవలయునన్నను- మొరపరాలు, ఇసుక, నిప్పు, కొలను మొదలగు
జలాధారములు, చప్పుడు, ఇత్యాదికము లేక సమమై మనస్సునకనుకూ
లమై పరిశుద్ధమై యుండెడి ప్రదేశమున మిక్కిలియెత్తుగాను మిక్కిలి
పల్లముగాను నుండక కదలని యాసనముపైని కుశలు కృష్ణాజినము
వస్త్రముఅనువానినిపరచి వానిపై స్వస్తికాద్యాసనముఁ గూరుచుం
డి శరీరమును కంఠమును శిరస్సునుగూడ సమముగా నిశ్చలముగా నిలి
పి విశ్వతైజసప్రాజ్ఞులను జాగ్రత్స్వప్నసుషుప్తిక్రమమున కార్యకా
రణవినిర్ముక్తుఁడగు పూర్ణాత్మయందుఁ జేర్చి తాను పూర్ణాత్మస్వరూప
మునను౦డి పూర్ణానందుఁడును నిరంజనుఁడును అనఁగా పవిత్రమై
న అంటును లేనివాఁడును క్రొత్తగా కలుగుటయు నశించుటయు లేని
జ్ఞానమే స్వరూపముగాఁగలవాఁడునగు పరమాత్మను నమోనమః అ
ని ధ్యానము చేయునది- ఇట్లు యోగాభ్యాసము చేయుచు నెప్పుడు
సాక్షాత్తుగా పరమాత్మను తెలిసికొనునో అప్పుడు అజ్ఞానంబును అ
జ్ఞానమువలన గలుగునవియుంగూడ పోయినవాఁడై దుఃఖము లెవ్వి
యు లేక కృతకృత్యుఁడగును- ఇట్లు జ్ఞానమువల్లనె పరమపురుషార్థ
ము లభించును గాన నేనె పరమానందస్వరూపుఁడనయిన యాత్మనని
తెలిసికొనునది- మఱి దేనిని తలంపఁగూడదు- అని శంకరభాష్యము,

రామానుజ సిద్ధాంతమున కర్మము జ్ఞానము భక్తి ప్రపత్తి అ
నునవి నాలుగు మోక్షోపాయములు- ఇందుభక్తియె సాక్షాత్తుగా

మోక్షోపాయము- కర్మజ్ఞానప్రపత్తులు దానికి అంగములు- కర్మమనఁగా ఈశ్వరకైంకర్యరూపముగా ఫలమును గోరక సంధ్యావందనయజ్ఞాదికర్మముల నాచరించుట- జ్ఞానమనఁగా తానెట్టివాఁడో తెలిసికొనుట- అనఁగా శరీరము ఆత్మకాదనియును తానుజ్ఞానానందస్వరూపుఁడనియును కర్మవశమున జ్ఞానానందములకు సంకోచము వచ్చియున్నదనియును తెలిసికొనుటయును యోగాభ్యాసమున నాత్మస్వరూపమును చూచుటయును- ఈజ్ఞానమే ఆప్రిమాదమనునది- ప్రపత్తియనఁగా మోక్షసాధనమగు భక్తినికలుగఁజేసికొనఁదగినయోగ్యత నాకులేదుగాన నీవే నేను మోక్షమును జెందునట్లు చేయవలయునని భగవంతుని యెడను భరన్యాసము చేయుట- ఈకర్మజ్ఞాన ప్రపత్తులవలన భక్తి కలిగి మోక్షమువచ్చును- ఈభక్తియె వేదనమనియును ఉపాసనమనియును ధ్యానమనియును చెప్పఁబడును- తమేవవిదిత్వాఅను శ్రుతికిఆతనిని ధ్యానముచేసియేయని యర్థము- భక్తియనునది భగవంతునిస్వరూపమును ఎడతెగకుండునట్లును శ్రద్ధకు కట్టునట్లును ప్రీతిపూర్వకముగా మాటిమాటికిని తలంచుచుండుటయే- కుర్వన్నేవేహ కర్మాణి జిజీవిషే చ్ఛతగ్ం సమాః (కర్మములను చేయుచునె నూఱేండ్లను బ్రదుకంగోరునది) అని ఈశావాస్యోపనిషత్తు చెప్పుచున్నది గాన కర్మములను ఎప్పుడును విడువఁగూడదు- సంన్యాసికిఁగూడ సంన్యాసాశ్రమవిహితములగు కర్మములు అవశ్యానుష్ఠేయములే- కర్మములకు సాత్త్వికత్యాగమును చేయునది- సాత్త్వికత్యాగమనఁగా ఫలసంగకర్తృత్వములను విడిచి కర్మములనాచరించుట- ఈయంశమెయస్తు కర్మఫలత్యాగీ సత్యాగీత్యభిధీయతే అను భగవద్గీతావచనమునఁ జెప్పంబడినది- పృథగాత్మానం ప్రేరితారంచ మత్వా జుష్టస్తతస్తే నామృతత్వమేతి (శ్వేతా॥ ౧అ॥ ౬మ॥) అను శ్రుతి జీవుఁడువేఱు ఈశ్వరుఁడువేఱు అని తెలిసికొని భగవంతుని ప్రీతికిపాత్రుఁడై మోక్షమును జెందునని చెప్పుచున్నది- కాఁబట్టిజీవుఁడు ఈశ్వరునకు శేషభూతుడుగాని జీవుఁడు పరబ్రహ్మముకాఁడు- అని రామానుజసిద్ధాంతము.

11-10-1895

ఆస్యాద్దేశాన్నిస్సరతేనరాణాం
క్రోధఃప్రమాదో లోభరూపశ్చమృత్యుః।
అహంగతేనైవచరన్ విమార్గా
న్నచాత్మనో యోగముపైతికశ్చిత్ ॥౭॥

క్రోధః లోభరూపశ్చ ప్రమాదః మృత్యుః=క్రోధస్వరూపంబును లోభస్వరూపంబునయిన ప్రమాదమనెడి మృత్యువు, ఆస్యాద్దేశాత్ నిస్సరతే=ఆస్యమను పేరున బయలుదేరుచున్నది- అహంగతేన విమార్గాన్నేవ చరన్=అహంకారముచేతను తప్పుత్రోవలనె సంచరించుచున్న, కశ్చిత్ ఆత్మనః యోగం నోపైతి=ఎవ్వఁడును ఆత్మయొక్క యోగమును పొందఁడు-

తా॥ ఆస్యమనఁగా అహంకారము- ఈఅహంకారముకామమై తేలును· కామమనఁగా కోరికె. ఆకామమునకు అడ్డు కలిగినతో డనె క్రోధముకలుగును- దానిపైని మోహముఅనఁగా అజ్ఞానముకలుగును- అహంకారమనఁగా శరీరమెతాననుకొనుట. దానివలనఇట్లు తప్పుత్రోవలను నడుచునుగాని పరమాత్మనుపొందఁజాలఁడు·

ఆస్యశబ్దమునకె కామమనియును అర్థము చెప్పవచ్చును· అని శంకరభాష్యము.

తే మోహితాస్తద్వశేవర్తమానా
ఇతః ప్రేతాస్తత్రపునఃపతన్తి।
తతస్తాన్ దేవా అనువిప్లవన్తే
హ్యతోమృత్యుర్మరణాఖ్యాముపైతి ॥౮॥

మోహితాః తే=మోహమునుపొందిన ఆయహంకారులు, తద్వశే వర్తమానాః=ఆమృత్యువువశమునందు ఉన్నవారై, ఇతః ప్రేతాః=ఇచ్చటనుండి పోయినవారై, తత్ర(స్థితాః)=అచ్చట నున్నవారై, పునః పతన్తి=వెండియు పడుచున్నారు- తతః తాన్ దేవాః అనువిప్లవన్తేహి=అటుపైని వారిని ఇంద్రియములు అనుసరించుచున్నవిగదా అతః మృత్యుః మరణాఖ్యామ్ ఉపైతి=ఇందువలన మృత్యువు మరణమను పేరును పొందుచున్నది·

తా॥ అహంకారాదిరూపమైన యాయజ్ఞానముచేత దేవ

మె ఆత్మయనెడి భ్రమమును చెందినవారై, ప్రమాదమనెడి మృత్యువుచేతఁజిక్కినవారై ఈలోకమునుండి ధూమాదిమార్గమున స్వర్గనరకాదులకుఁబోయి ఆయాలోకములలోనుండవలసిన కాలముండి తిరిగియును పుట్టుటకయి ఈలోకమును జేరుదురు- అప్పుడు ఇంద్రియములు కలుగునుగాన వానిత్రోవనె పూర్వోక్తరీతిని తిరుగుచుందురు. ఇట్లు జననమరణపరంపరలోబడి ముక్తిని చెందకుందురు.

కర్మోదయేకర్మఫలానురాగా
స్తేతత్రానుయాన్తినతరన్తిమృత్యుమ్ ।
సదర్థయోగానవగమాత్సమన్తాత్
ప్రవర్తతేభోగయోగేనదేహీ ॥౯॥

కర్మోదయే=కర్మములుకలిగినతోడనె, కర్మఫలానురాగా (స్తు న్తః)=కర్మములఫలములయందు అనురాగముగలవారై, తే తత్ర అనుయాన్తి=వారు ఆకర్మఫలములను అనుసరింపుచుందురు- మృత్యుం నతరన్తి=మృత్యువును దాఁటరు- సదర్థయోగానవగమాత్=పరమాత్మనుగూర్చిన యోగమును తెలియకుండుటను, దేహీ భోగయోగేన సమన్తాత్ ప్రవర్తతే=సంసారి భోగసంబంధమున అన్నిటియందును ప్రవర్తించును.

తా॥ ఫలములనుగోరి కర్మములను చేయుచు ఆఫలానుభవమునకై ఇహలోకపరలోకములలోఁదిరుగుచు జననమరణములను పొందుచు సంసారమునపడియుందురు- ఇందుకేమి హేతువన్న పరమాత్మను చేరెడి విధము నెఱుంగకపోవుటయె హేతువు- అట్టిసాధనము నెఱుంగక భోగసాధనములగు కర్మములను ఆచరింపుచు సంసారములో పడియుందురు-

సదర్థమనఁగా సత్తుఅనెడి పరబ్రహ్మము- దానియోగమనగా చిదానందస్వరూపమై అద్వితీయమయిన పరబ్రహ్మంబును తానునొకటియెయని యెఱుఁగకపోవుట- అనిశంకరభాష్యము.

తద్వైవమహామోహనమింద్రియాణాం
మిథ్యార్థయోగేస్యగతిర్హినిత్యా।
మిథ్యార్థయోగాభిహతాన్తరాత్మా

స్మరన్నుపాస్తే విషయాన్ సమన్తాత్ ॥౧౦॥

ఇంద్రియాణాం తత్ మహామోహానం హి=ఇంద్రియములకు ఆవిషయప్రవృత్తి మిక్కిలి యజ్ఞానమును కలుగఁజేయునదిగదా- మిథ్యార్థయోగే అస్యగతిః నిత్యాహి=అజ్ఞానము కలిగినతోడనె ఇతనికి సంసారగతి నిత్యముగా నుండునదిగదా- మిథ్యార్థయోగాభిహతాన్తరాత్మా=అజ్ఞానముచేత చెడఁగొట్టఁబడిన యంతఃకరణముకలవాఁడై, సమన్తాత్ విషయాన్ స్మరన్ ఉపాస్తే=అంతటను విషయములనె తలంచుచు(విషయములనె) సేవించుచుండును-

తా॥ మిథ్యార్థయోగమనఁగా దేహమెఆత్మయనెడి యజ్ఞానము- ఇంద్రియములువిషయములయందు ప్రవర్తింపగా ప్రవర్తింపగా ఈయజ్ఞానము దృఢపడుచుండును- ఈదేహాత్మాభిమానము దృఢపడినకొలది అంతఃకరణమునకు నైర్మల్యముకలుగదు- దానివలన ఎప్పుడును సంసారములోనెపడియుండును-

మిథ్యార్థములనఁగా అసత్యములయిన విషయములు- ఆనిశంకరభాష్యము-

అభిధ్యావైప్రథమంహన్తి చైనం
కామక్రోధావనుగృహ్యాశుపశ్చాత్।
ఏతెబాలాన్మృత్యవెప్రాపయన్తి
ధీరాస్తుధైర్యేణతరన్తిమృత్యుమ్ ॥౧౧॥

అభిధ్యాచ ఏనం ప్రథమం హన్తివై=విషయాభిముఖ్యము ఈతనిని మొదట చెడఁగొట్టును- పశ్చాత్ ఆశు కామక్రోధా అనుగృహ్య (హతః)=ఆవెంటనె శీఘ్రముగా కామక్రోధములు అనుగ్రహించి (చెడఁగొట్టును)- ఏతె బాలాన్ మృత్యవె ప్రాపయన్తి=ఇవి మూఢులను మృత్యువునకై నడిపించును- ధీరాస్తు ధైర్యేణ మృత్యుమ్ తరన్తి=ధీరులగువారు ధైర్యమున మృత్యువును దాఁటుదురు-

తా॥ విషయాభిలాషము మొదట వీనిస్వరూపమును చెడఁగొట్టును- ఆవెంటనె కామము వీనిని విషయములతోఁజేర్చి చెడఁగొట్టును- కామముకలిగినవెంటనె క్రోధముకలిగి వీనిని చెడఁగొట్టును- ఈయభిధ్యాకామక్రోధములు ఇట్లు ఆవివేకులను మృత్యువునకుఁజే

ర్చును- ధైర్యముగలవారలు తమ ధైర్యముచేత విషయములకు లొంగక మృత్యువును దాఁటి పరమాత్మను చేరెదరు.

యోఽభిధ్యాయన్నుత్పతిష్ణూన్నిహన్యా
దనాదరేణాప్రతిబుధ్యమానః ।
నైనంమృత్యుర్మృత్యురివాత్తి భూత్వా
హ్యేవంవిద్వాన్ యోవినిహన్తి కామాన్ ॥౧౨॥

యః అభిధ్యాయన్ = వివేకియగునెవ్వఁడు లెస్సగా నాలోచింపుచు, అనాదరేణ అప్రతిబుధ్యమానః = అనాదరముతో సరకు సేయకున్నవాఁడై, ఉత్పతిష్ణూన్ నిహన్యాత్ = ఉబుకుచుండెడి విషయములను పోఁగొట్టునో, ఏనం మృత్యుః నాత్తి = ఈతనిని మృత్యువు మ్రింగదు- ఏవంవిద్వాన్ యః = ఇట్లు తెలిసికొనుచున్న ఎవ్వఁడు, కామాన్ వినిహన్తి = కోరికలను పోఁగొట్టునో, సః మృత్యురివభూత్వా మృత్యుమ్ అత్తి = వాఁడు మృత్యువువలెనయి (మృత్యువును) మ్రింగుచున్నాఁడు-

తా॥ విషయములనిత్యములనియును అపరిశుద్ధములనియును దుఃఖముతోఁగూడినవనియును తలంచుచున్నవాఁడై విషయములను ఆదరింపక ఎవ్వఁడు విడిచిపెట్టునో, వాఁడు కామములను తిరస్కరించినవాఁడుగాన మృత్యువునకు మృత్యువువంటివాఁడు- వానిని మృత్యువేమియును చేయఁజాలదు.

కామానుసారీ పురుషః కామాననువినశ్యతి ।
కామాన్ వ్యుదస్యధునుతే యత్కించిత్పురుషో రజః ॥౧౩॥

కామానుసారీ పురుషః = కామములను అనుసరించెడి పురుషుఁడు, కామానను వినశ్యతి = కామములవెంటనె నశించును- కామాన్ వ్యుదస్య (స్థితః) పురుషః = కామములను త్రోసివేసి(యున్న) పురుషుఁడు, యత్కించిత్ రజః ధునుతే = ఏదైనను (ఉన్న) రజస్సును విదల్చికొనును

రజస్సనఁగా జన్మాంతరములసంపాదించిన పుణ్యపాపరూపమైన కర్మము- అని శంకరభాష్యము

కామములయందాసక్తుండగువాఁడు ఆకామములెట్లుకొంచెముకాలములోనె నశించిపోవునో అట్లెస్వల్పకాలముననె నశించును-

15-10-1895

విషయములయందలిదోషములను తెలిసికొని కామములనువిడుచువాఁడు తనకర్మములనన్నిటిని పోఁగొట్టుకొనును-

దేహాంపరికాశోభూతానాంనరకోయంప్రదృశ్యతే ।
గృధ్నన్త్యేవధావన్తిగచ్ఛన్తశ్శ్వభ్రిమున్ముఖాః ॥౧౪॥

భూతానామ్ అయం దేహః=జంతువుల ఈ దేహము, అప్రకాశః నరకః ప్రదృశ్యతే=స్ఫుటముగానున్న నరకముగా చూడఁబడుచున్నది. శ్వభ్రిమ్ ఉన్ముఖాః గచ్ఛన్తః (ఇవ)=గొయ్యిని అధోముఖులై చేరువారి (వలె), గృధ్నన్త్యేవ ధావన్తి=అపేక్షపడుచున్నవారై పరుగెత్తుచున్నారు

తా॥ ఈశరీరము శ్లేష్మము రక్తము చీము మలము మూత్రము వీనితోనిండియుండుటవలన మరుగుగానున్న నరకమే- ఇట్టిదేహమైన స్త్రీలు మొదలగు వారిదేహమునకయిఅపేక్షపడుచు పఱుగెత్తుచున్నారు- ఈపరుగెత్తుటగుడ్డివాఁడునూతికైపరుగెత్తుటను పోలియున్నది.

అమన్యమానఃక్షత్రియకించిదన్య
న్నాధీయతే తార్ణఇవాస్యవ్యాఘ్రః ।
క్రోధాల్లోభాన్మోహభయాన్తరాత్మా
సవైమృత్యుస్త్వచ్ఛరీరేయఏషః ॥౧౫॥

హేక్షత్రియ=ఓక్షత్రియుఁడా (ఓధృతరాష్ట్రుఁడా), అన్యత్ కించిత్ అమన్యమానః=మఱియొకదానిని చింతింపనివాఁడై, నాధీయతే=చదువుకొనఁడు- అస్య (దేహః)=ఈతని (శరీరము,) తార్ణః వ్యాఘ్రఇవ (భవతి)=గడ్డితోఁ జేయఁబడినపులివంటిది(అగుచున్నది-) త్వచ్ఛరీరే=నీశరీరమునందు, క్రోధాత్ లోభాత్ యఏషః మోహభయాన్తరాత్మా (అస్తి)=క్రోధమువల్లను లోభమువల్లను ఏయీ అజ్ఞానభయములతోఁ గూడినయంతఃకరణము(కలదో,) సః మృత్యుర్వై= అది మృత్యువేకదా.

తా॥ కామాంధుఁడగువాఁడు అదితప్ప పరమార్థమునేమియును తెలిసికొనఁడు- పరమార్థమును తెలిసికొనఁదగిన చదువునైనను చదువఁడు- అట్టివానిశరీరము గడ్డితోఁ జేయఁబడిన పులివలె కార్యకరముకానిది- ఇట్టివాని యంతఃకరణము కామక్రోధములవ

లనఁగలిగెడి మోహభయములతోఁ జేరియుండునుగాన అదియె వానికి మృత్యువని చెప్పఁదగినది-

ఏవంమృత్యుంజాయమానంవిదిత్వా
జ్ఞానేతిష్ఠన్నబిభేతీహమృత్యోః ।
వినశ్యతేవిషయేతస్యమృత్యు
ర్మృత్యోర్యథా విషయంప్రాప్యమర్త్యః ॥౧౮॥

ఏవం జాయమానం మృత్యుంవిదిత్వా- ఇట్లు కలుగుచుండెడి మృత్యువును తెలిసికొని, జ్ఞానే తిష్ఠన్= జ్ఞానమునందు ఉన్నవాఁడు, ఇహ మృత్యోః నబిభేతి- ఇచ్చట మృత్యువునకు బెదరఁడు- తస్యవిషయె మృత్యుః వినశ్యతే= వానివిషయమున మృత్యువు నశించును- మృత్యోః విషయం ప్రాప్య మర్త్యః యథావినశ్యతే= మృత్యువు యొక్క విషయమును పొంది మనుష్యుఁడు ఎట్లు నశించునో,

తా॥ ఇట్లుక్రోధాది రూపమున కలిగెడి దేహాత్మాభిమానమనెడిమృత్యువును తెలిసికొనినవాఁడయి జ్ఞానమును సంపాదించికొనినవాఁడు మృత్యువునకు భయపడఁడు వానియెడమృత్యువులేనిదేయగును- మృత్యువుకలిగినపామరుఁడు, తానులేనివాఁడగునట్లు

ధృతరాష్ట్రఉవాచ- ధృతరాష్ట్రుఁడు పలికెను-

యానేవాహురిజ్యయాసాధులోకాన్
ద్విజాతీనాంపుణ్యతమాన్ సనాతనాన్ ।
తేషాంపరార్థంకథయన్తీహవేదా
ఏతద్విద్వాన్నైతికథంనుకర్మ ॥౧౯॥

ఇజ్యయా ద్విజాతీనాం పుణ్యతమాన్ సనాతనాన్ యాన్ సాధులోకానేవ ఆహుః= యాగముచేతను బ్రాహ్మణులకు మిక్కిలిపుణ్యములయినవియును శాశ్వతములయినవియునగు ఏ మంచిలోకములనె చెప్పుచున్నారో, తేషాం పరార్థం ఇహ వేదాః కథయన్తి= అవి పరమపురుషార్థములగుటను ఇచ్చట వేదములు చెప్పుచున్నవి- ఏతత్ విద్వాన్ కథంను కర్మ నైతి= ఇది ఎఱిఁగినవాఁడు ఎట్లు కర్మమును పొందఁడు-

తా॥ జ్యోతిష్టోమాదికర్మములచేతసత్పురుషులు పొందఁద

గినలోకములుకలుగునని చెప్పుచున్నారు- ఈసంసారమున బ్రహ్మలోకమువరకు నుండెడి అనిత్యలోకము లై పరమపురుషార్థమని వేదములు చెప్పుచున్నవి- ఇట్లుండగా జ్ఞాని ఆలోకములనుగోరి ఆకర్మములను పల ఆచరింపఁగూడదు.

సనత్సుజాతఉవాచ= సనత్సుజాతుఁడు పలికెను-

ఏవంహ్యవిద్వా నుపయాతితత్ర
తథార్థజాతంచ వదన్తి వేదాః।
స నేహ ఆయాతి పరం పరాత్మా
ప్రయాతిమార్గేణ నిహన్త్యమార్గాన్ ॥ ౧౮॥

అవిద్వాన్ హి ఏవం తత్ర ఉపయాతి= అజ్ఞాని ఇట్లు ఆకర్మములలో చేరుచున్నాఁడు- తథా వేదాః అర్థజాతంచ (తస్యైవ) వదంతి=అట్లు వేదములు ఫలసమూహములను (వానికే) చెప్పుచున్నవి-సః ఇహ నాయాతి= ఆజ్ఞాని ఈకర్మములలోనికి రాఁడు- పరాత్మా (సన్) పరం ప్రయాతి= పరిశుద్ధాత్ముఁడగుచు పరమును పొందుచున్నాఁడు- మార్గేణ అమార్గాన్ నిహన్తి= ఈమార్గమున అపమార్గములను పోఁగొట్టును-

తా॥ బ్రహ్మలోకాదులలో ననుభవింపవలసిన సుఖమునే పురుషార్థమునుగాకోరి కర్మములయందు ప్రవర్తించువాఁడు అజ్ఞానియె- వేదములోఁ జెప్పఁబడిన ఈప్రయోజనములన్నియును ఆయజ్ఞానికె- కావుననే జ్ఞానియగువాఁడు బ్రహ్మలోకాదిసుఖానుభవమునకై కర్మములనాచరింపఁడు- మఱియేమిచేయునన్నను, తనయాత్మను పరిశుద్ధునిచేసికొని మోక్షమార్గమున ప్రవర్తించును- తప్పుతోవలను నడువఁడు.

జ్ఞానియగువాఁడు తానే పరమాత్మయని తెలిసికొనుచు జ్ఞానమార్గమున ప్రవర్తించును- అని శంకరభాష్యము.

ధృతరాష్ట్రఉవాచ=ధృతరాష్ట్రుఁడు పలికెను-

కోవాసియుక్తేతమజంపురాణం
స చేదిదంసర్వమనుక్రమేణ।
కింవాస్యకార్యమథవాసుఖంచ

తన్మేవిద్వన్ బ్రూహి సర్వం యథావత్ ॥౯॥

స: అనుక్రమేణ ఇదం సర్వం (కరోతి) చేత్=ఆయీశ్వరుఁడు క్రమముగా నిదియంతయును (చేయు)నేని, అజం పురాణం తం కో వా నియుజ్తే=పుట్టుకలేనివాఁడును పురాతనుఁడును గు వానిని ఎవ్వఁడు నియోగించుచున్నాఁడు- అస్య కార్యం కిమ్=ఈతనికి కార్యము ఏమి- అథవా సుఖంచ (అస్తి)కిమ్- లేక సుఖముగూడ (కలదా) యేమి- హే విద్వన్=ఓజ్ఞానీ, తత్సర్వం మే యథావత్ బ్రూహి=దానినంతటిని నాకు ఉన్నదున్నట్లు చెప్పుము-

తా॥ ఆభగవంతుఁడు ఈసృష్టినంతటిని చేయుటకు ప్రయోజనమేమి- దీనివలన నాతనికేమైన సుఖముకలదా-

స: అనుక్రమేణ ఇదం సర్వం (భవతి) చేత్- ఆపరమాత్మ క్రమముగా నిది యంతయును (అగు) నేని- ఈతనిని ఇట్లగుటకు ప్రేరణ చేయువాఁడెవ్వఁడు- ఈతనికి ఏమికార్యము- అథవా అసుఖమ్ అని పదచ్ఛేదము- ఈతనికి ఇట్లు సంసారమును బొందనియెడను అసుఖము అనఁగా అనర్థమేమికలుగును- అని శంకరభాష్యము-

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు పలికెను-

దోషో మహానత్ర విభేదయోగే
హ్యనాదియోగేన భవన్తి నిత్యాః।
తథాస్యనాధిక్యమపైతి కించి
దనాదియోగేన భవన్తి పుంసః॥౧౦॥

అత్ర విభేదయోగే (సతి) మహాన్ దోషః (భవతి)=ఇచ్చట ఆగంతుకసంబంధము (కలుగుచుండఁగా) గొప్పదోషము (కలుగుచున్నది)- అనాదియోగేన నిత్యాః భవన్తి=అనాదిసంబంధముచేత నిత్యములె అగుచున్నవి- తథాఽపి అస్య ఆధిక్యం కించిదపి నాపైతి=అట్లయినను ఈతనికి ఆధిక్యము కొంచెమైనను పోదు- పుంసః అనాదియోగేనైవ భవంతి=జీవులు అనాదిసంసారసంబంధములోనె ఉన్నారు-

తా॥ పరమేశ్వరునకు ఒక్కకార్యముకొఱకు సృష్ట్యాదికర్తృత్వము ఆగంతుకముగావచ్చు నన్నయెడను అంతకుపూర్వము ఈశ్వరుఁడె కాకపోవుటయు నెడు దోషము కలుగును- ఏలఁ బడునవియున్నం

గహాపలువాఁడని చెప్పఁబడుటు సందర్భించుచున్న- ఈసృష్టిస్థితిసంహార ములుఅనాదిగా ఆతనివె అయియుండుటను ఇవినిత్యములె- క్రొత్తగా సంసారమును కల్పింపకపోవుటచేత ఆతనికి ఈశ్వరత్వలోపమేమి యును లేదు- జీవులందఱును అనాదిసంసార సంబంధముతోనె ఉ న్నారు-

విభేదయోగె=పరబ్రహ్మము వేఱు జీవులు వేఱు అనెడి భేదము నొప్పినయెడను (ఛా॥౬॥౮॥౭॥) తత్త్వమసి (నీవు) ఆబ్రహ్మామె అ గుచున్నావు- ఇత్యాది మహావాక్యములన్నియును అయథార్థము లు కావలసి వచ్చును- (తై॥ఉ॥౨॥౭॥౨॥)యదాహ్యేవైష... ఉదర మన్తరంకురుతె। అథతస్య భయంభవతి।, (ఎప్పుడైతేసయీాతఁడు కొంచెమైనను భేదమును ఆలోచించునో, అటపైని ఆతనికి భయము కలుగును) అనుశ్రుతికూడ విరోధించును- అనాదియనఁగా ఆదిలేని మాయ- దానిచేత జీవులగుచున్నాఁడు- సంసారము మిథ్యాభూత ముగాన ఆపరబ్రహ్మముయొక్క ఆధిక్యమెప్పుడును తగ్గియుండదు- ఇట్లు మాయాసంబంధము చేత అనేకజీవులుఅగుచున్నాఁడు- అనిశం కరభాష్యము-

యదేతదత్త్వం భగవాన్ సనిత్యో
వికారయోగేనకరోతివిశ్వమ్।
తథాచతచ్ఛక్తిరితిస్మమన్యతే
తథార్థయోగేచభవన్తివేదాః ॥౨౦॥

నిత్యః సః భగవాన్=నిత్యుఁడైన ఆ భగవంతుఁడు, వికారయోగేన విశ్వం కరోతి(ఇతి) యత్=ప్రకృతిసంబంధము చేత విశ్వమును చే యుచున్నాఁడనునది యేదికలదో, ఏతత్ అత్త్వం=ఇది తత్త్వమైనది- తథాచ తచ్ఛక్తిరితి మన్యతేస్మ=కాబట్టి ఆతనిశక్తియని తలంపఁబడి నది- తథా అర్థయోగే వేదాశ్చ భవన్తి=అట్లు ప్రకృతి సంబం ధమువిషయమున వెదవాక్యములుగూడ కలవు-

తా॥ ఆభగవంతుఁడుఎల్లప్పుడుమంచువాఁడె- ప్రకృతినివిక రింపఁజేసి జగత్తును కలుగఁజేయును- కావుననె ఆప్రకృతిఆతనశక్తి

యనిచెప్పఁబడును. ఇందుకు ప్రమాణములు వేదవాక్యములే-

పరమేశ్వరుఁడు వస్తుస్థితిని ఐశ్వర్యాదులతోఁ గూడినవాఁడై, ఆయన ఈప్రపంచమునకు కారణము కాఁడు- అతనిశక్తియైనమాయయె ఈప్రపంచమునంతటిని చేయుచున్నది- అతనికి మాయకలదనుటకు వేదవాక్యములె ప్రమాణము- ఆనిశంకరభాష్యము-

ధృతరాష్ట్ర ఉవాచ=ధృతరాష్ట్రుఁడు పలికెను

యస్మాద్ధర్మానాచరన్తీహ కేచిత్
తథాధర్మాన్ కేచిదిహాచరన్తి।
ధర్మః పాపేనప్రతిహన్యతేవా
ఉతాహో ధర్మః ప్రతిహన్తి పాపమ్॥౨౨॥

ఇహ కేచిత్ ధర్మాన్ ఆచరంతి=ఇచ్చట కొందఱు ధర్మములను ఆచరించుచున్నారు- ఇహ కేచిత్ తథా అధర్మాన్ ఆచరన్తి=ఇచ్చట కొందఱు అట్లె అధర్మములను ఆచరించుచున్నారు- యస్మాత్ (పవం వర్తతె తస్మాత్ పృచ్ఛామి)=ఎందువలన (ఇట్లు జరుగుచున్నదో అందువలన అడుగుచున్నాను)- పాపేన ధర్మః ప్రతిహన్యతేవా= పాపముచేత ధర్మము కొట్టఁబడుచున్నదా- ఉతాహో ధర్మః పాపం ప్రతిహన్తి=లేక ధర్మము పాపమును పోఁగొట్టునా-

తా॥ లోకములో కొందఱు ధర్మకార్యములను చేయుచున్నారు- కొందఱు సురాపానము మొదలగు అధర్మకార్యములను చేయుచున్నారు- ఇందు ధర్మము పాపముచేతఁ బోఁగొట్టఁబడునా- లేక ధర్మము పాపమును బోఁగొట్టునా.

సనత్సుజాత ఉవాచ= సనత్సుజాతుఁడు పలికెను-

తస్మిన్ స్థితో వాప్యుభయం హి నిత్యం
జ్ఞానేన విద్వాన్ ప్రతిహన్తి సిద్ధమ్।
యథాన్యథా పుణ్యముపైతి దేహీ
తథాగతం పాపముపైతి సిద్ధమ్ ॥౨౩॥

తస్మిన్ స్థితో వాపి=ఆకర్మమునందు ఉన్నవాఁడైనను, విద్వాన్ ఉభయం జ్ఞానేన నిత్యమ్ ప్రతిహన్తి=జ్ఞానియగువాఁడు రెండిటిని

జ్ఞానముచేత నిత్యముగా పోఁగొట్టును- ఇదం సిద్ధమ్=ఇది సిద్ధము అన్యథా(స్థితః) దేహీ=మఱియొక్కవిధముగా (నున్న) శరీరవంతుఁడనఁగా అజ్ఞాని, యథా పుణ్యమ్ ఉపైతి=ఎట్లు పుణ్యమును పొందుచున్నాఁడో, తథా అగమ్ పాపమ్ ఉపైతి=అట్లె తటస్థించిన పాపమును పొందుచున్నాఁడు- (ఏతత్) సిద్ధమ్- (ఇదియును) శ్రుతిసిద్ధమయినదె.

తా॥ జ్ఞానియగువాఁడు పుణ్యాపుణ్యకర్మములను చేయుచున్నను జ్ఞానముచేత ఆరెండిటిని పోఁగొట్టుకొనును- ఈయంశము (ము॥౨॥౨॥౮॥) క్షీయన్తే చాస్యకర్మాణి తస్మిన్ దృష్టే పరావరే అను శ్రుతిలోఁ జెప్పఁబడినది- మనముగొప్పవిఅనుకొనునః యన్నియును ఎవ్వనికంటె తక్కువవో అట్టిపరమేశ్వరుని దర్శనము కలిగినతోడనె వీనికర్మములన్నియును నశించును అనిశ్రుత్యర్థము- జ్ఞాని కాకఫలములకై కర్మములనాచరించువాఁడు పుణ్యపాపఫలములను అనుభవింపుచుండును- ఇందుకు ప్రమాణము- అనన్దానామతేలోకా అన్ధేనతమసావృతాః। తాంస్తే ప్రేత్యాభిగచ్ఛన్త్యవిద్వాంసో బుధాజనాః-అనిబృహదారణ్యకము(౬॥౪॥౧౧)-అజ్ఞానముతోనిండియున్న అనందములనెడి లోకములుకలవు- అజ్ఞానులు ఆలోకములను పొంది అనుభవింతురు- అని ఈశ్రుతితాత్పర్యము.

గత్వోభయం కర్మణా భుజ్యతేస్థిరం
శుభస్యపాపస్యస చాపికర్మణా।
ధర్మేణపాపం ప్రణుదతీహవిద్వాన్
ధర్మో బలీయానితితస్యసిద్ధిః ॥౨౪॥

శుభస్య పాపస్యచ అస్థిరం ఉభయం (ఫలం) గత్వా భుజ్యతే=మంచికర్మముయొక్కయును చెడ్డకర్మముయొక్కయును అస్థిరమైన రెండువిధముల (ఫలంబును) పరలోకమునుపొంది అనుభవింపఁబడును- సచాపి విద్వాన్(యది)=వాఁడైనను తెలివిగలవాఁడైనయెడను, ధర్మః బలీయాన్ ఇతి=ధర్మముబలవంతమైనదిగాన, ధర్మేణ పాపం ప్రణుదతి=ధర్మముచేత పాపమును పోఁగొట్టుచున్నాఁడు- తస్య

సిద్ధిః (అస్తి)-దానికి శ్రుతిసిద్ధి (కలదు)-

తా॥ పరలోకమున పుణ్యపాపఫలములు అనుభవింపఁబడు ను- రెండునుఅస్థిరములై- కర్మములఫలమును గోరక పరమేశ్వరారాధనరూపముగా కర్మములనాచరించుచుండెడి తెలివిగలవాఁడు ఆకర్మములచేత పాపమును బోఁగొట్టుకొనును.

ధృతరాష్ట్రఉవాచ-ధృతరాష్ట్రుఁడు పలికెను.

యానిహాహుః స్వస్యధర్మస్యలోకాన్

ద్విజాతీనాంపుణ్యకృతాం సనాతనాన్।

తేషాంక్రమాన్ కథయతతోపిచాన్యా

న్నేతద్విద్వన్ వేత్తుమిచ్ఛామికర్మ॥ ౨౫ ॥

ఇహ పుణ్యకృతాం ద్విజాతీనామ్ స్వస్యధర్మస్య- ఈలోకమునే పుణ్యకర్మముల నాచరించెడి ద్విజులయొక్క స్వకీయమైనధర్మమునకు, సనాతనాన్ యాన్ లోకాన్ ఆహుః-చాలకాలముండెడి ఏ లోకములను చెప్పుచున్నారో, తేషాం క్రమాన్ కథయ- వాని క్రమములను చెప్పుము- తతః అన్యానపిచ కథయ-వానికంటె ఇతరమైనవానినిగూడ చెప్పుము- హేవిద్వన్- ఓపండితుఁడా, ఏతత్ వేత్తుమ్ ఇచ్ఛామి- దీనిని తెలియను కోరుచున్నాను-

తా॥ మంచికర్మముల నాచరించినవానికి ఏలోకములు కలుగునో, చెడుకర్మములనాచరించినవారికి ఏలోకములు కలుగునో, ఆరెండిటిని తెలియఁజేయవలయును-

(ఈపద్యశ్లోకము శంకరభాష్యమున కానఁబడదు)

సనత్సుజాతఉవాచ- సనత్సుజాతుఁడు పలికెను.

యేషాంధర్మేషువిస్పర్ధా బలేబలవతామివ,

తేబ్రాహ్మణాఇతః ప్రేత్యస్వర్గే యాన్తిప్రకాశతామ్ ॥౨౬॥

బలవతాం బలఇవ- బలవంతులకు బలమునందువలె, యేషాం ధర్మేషు విస్పర్ధా (భవతి)- ఎవ్వారలకు ధర్మమునందు స్పర్థ (కలుగునో), తే బ్రాహ్మణాః ఇతః ప్రేత్య- ఆ బ్రాహ్మణులు ఈలోకమునుండి పోయి, స్వర్గే ప్రకాశతాం యాన్తి-స్వర్గమున ప్రసిద్ధులై

గుటను పొందుదురు.

తా॥ స్వర్గమునందలి సుఖానుభవము మిగిలి బలవంతుడగు రాజు రెండవరాజు బలమును సహింపనియట్లు రెండవవాడు సంపాదించెడి సుఖముకన్న వేఱొకడు సుఖమును సంపాదింపవలయునను స్పర్థతో నెవ్వారలు కర్మముల నాచరింతురో వారు స్వర్గమున ఫలానుభవమును బొందుచు అచ్చట ప్రసిద్ధులైయుందురు.

స్వర్గమునందు కలిగెడి సుఖములు ఊర్వశీసంభోగాదులు. ఇట్లు ఫలసంగముతో గూడిన కర్మమునాచరించెడి వారు ధూమాదిమార్గమున స్వర్గముం జేరి నక్షత్రములుగా ప్రకాశింపుచుందురు. అనిశంకరభాష్యము.

యేషాం ధర్మే న పస్పర్ధా తేషాం తద్ జ్ఞానసాధనమ్।
తే బ్రాహ్మణా ఇతః ప్రేతాః స్వర్గం యాన్తి త్రివిష్టపమ్॥ ౨౮॥

యేషాంచ ధర్మే స్పర్ధా నాస్తి - ఎవ్వరికైతే ధర్మమున స్పర్థ లేదో, తేషాం తత్ జ్ఞానసాధనమ్ = వారికి అది జ్ఞానసాధనము. తే బ్రాహ్మణాః ఇతః ప్రేతాః - ఆ బ్రాహ్మణులు ఈలోకమును విడిపోయినవారై, త్రివిష్టపం స్వర్గం యాన్తి - త్రివిష్టపమనెడి స్వర్గమును పొందుచున్నారు.

తా॥ ఫలమును గోరక పోవుటచేత స్పర్థలేక ఈశ్వరారాధనరూపముగా కర్మములనాచరించువారలకు ఆకర్మము జ్ఞానమునె కలుగజేయును. వారు ఈశరీరము పోయినతోడనే మోక్షమును జెందుదురు.

ఈ యజ్ఞాదికర్మములు చిత్తశుద్ధిని కలుగజేసి దానిద్వారమున జ్ఞానమును కలుగజేయును. ఇట్లు శుద్ధాంతఃకరణులగువారు పరమాత్మయె తానని తెలిసికొందురు. వారుస్వర్గమనగా పూర్ణానందబ్రహ్మమును చేరుదురు. త్రివిష్టపమనగా ఆధ్యాత్మికాధిభౌతికాధిదైవికములనెడు తాపత్రయముచేతగాని సత్త్వరజస్తమోగుణములనెడు గుణత్రయముచేతగాని జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి అవస్థాత్రయముచేతగాని విడువబడినదియనియర్థము. దీనిలో వి

శించిన యధికారిని రక్షించుచున్నదియని యైననవయవార్థము చెప్ప వచ్చును- అని శంకర భాష్యము.

తస్య సమ్యక్సమాచారమాహుర్వేదవిదో జనాః।
నైనం మన్యేత భూయిష్ఠం బాహ్యమాభ్యన్తరం జనమ్ ॥౨౭॥

వేదవిదః జనాః = వేదములనెఱింగిన జనులు, తస్య సమ్యక్సమాచారం (వక్ష్యమాణమ్) ఆహుః = వాని మంచినడతను (ఇఁకఁజెప్పఁబోవుదానిగా) చెప్పుదురు- బాహ్యమ్ ఆభ్యన్తరమ్ జనమ్ = వెలుపలివారును లోపలివారునగు జనులు, ఏనం భూయిష్ఠం న మన్యేత = ఈతనిని విస్తారముగా మన్నింపరు.

తా॥ ఇఁకను ఆజ్ఞానియొక్క నడత చెప్పఁబడును- ఈనడత వేదవేత్తలు చెప్పినరీతినె చెప్పఁబడును- వెలుపలివారుగాని తనవారగు పుత్రాదులుగాని వీనిని తమలోనివానిగా తలంపకుండునట్లు సంచరింపవలయును- వారలయెడను తాను సాధారణబుద్ధి నుండవలయుననుట-

పుత్రమిత్రాదులుగూడ తన్నెఱుంగకుండునట్లు నిర్జనప్రదేశమునే నుండునది యనిశంకరభాష్యము

యత్ర మన్యేత భూయిష్ఠం ప్రావృషీవ తృణోదకమ్।
అన్నం పానం బ్రాహ్మణస్య తత్ర జీవే న్నానుసంజ్వరేత్ ॥౨౮॥

ప్రావృషి తృణోదకమివ = వర్షాకాలమున పచ్చికయునుదకమును వలె, యత్ర బ్రాహ్మణస్య అన్నం పానం భూయిష్ఠం మన్యేత = ఏస్థలమున బ్రాహ్మణునకు అన్నమును పానంబును విస్తారముగా (కలుగునని) తోఁచునో, (తత్ర స్థిత్వా = అచ్చటనుండి) తత్ జీవేత్ = ఆయన్నాదికమును పుచ్చుకొనునది- నానుసంజ్వరేత్ = అన్నపానములకై బాధపడకూడదు-

తా॥ వర్షాకాలమున అన్నిచోట్లను గడ్డి మొలచి నీరుకలిగియుండునట్లు ఏస్థలమున అన్నపానములు సర్వదా కలిగియుండునో, అచ్చట ఈజ్ఞాని వాసము చేయవలయును. అన్నపానములు లేక శ్రమపడునట్లుండకూడదు

యత్రాకథయమానస్య ప్రయచ్ఛత్యశివంభయమ్।
అతిరిక్తమివాకుర్వన్ సశ్రేయాన్నేతరోజనః ॥౩౦॥

యత్ర (స్థితః) జనః= ఎచ్చట (నున్న) జనము, అకథయమానస్య అస్య= మౌనమునువహించిన ఈతనికి, అతిరిక్తమ్ అకుర్వన్= గొప్పను చేయక, అశివంభయం ప్రయచ్ఛతీవ= అగౌరవమును బెదరించుటను చేయునట్లుండునో, (తత్రస్థితః) సః జనః శ్రేయాన్= అచ్చటనున్న ఆ జనమె శ్రేష్ఠముః- ఇతరం జనః న శ్రేయాన్= మిగిలిన జనము శ్రేష్ఠముకాదు-

తా॥ మాటలాడక ఎక్కడఁబట్టిన నక్కడపండుకొనుచుతన మాహాత్మ్యమును తెలియనీక మొండివాఁడు మూగవాఁడు పిశాచము మొదలయినవానివలె సంచరింపుచున్నజ్ఞానికి, ఏజనముఆమాహాత్మ్యము నెఱుఁగక అగౌరవములను జేతురేకాని పూజింపకుందురో అట్టి జనులలోనె ఈజ్ఞానియుండవలెను- తన్నుజూచినతోడనె అతిగౌరవము చేసెడి జనులదగ్గఱ ఈజ్ఞానియుండగూడదు-

యోవాకథయమానస్యహ్యాత్మానంనానుసంజ్వరేత్।
బ్రహ్మస్వంనోపహన్యాద్వాతదన్నంసంమతంసతామ్॥౩౧॥

యోవా అకథయమానస్య ఆత్మానం నానుసంజ్వరేత్ =ఎవ్వఁడు మౌనియొక్క ఆత్మను బాధింపఁడో, బ్రహ్మస్వమ్ నోపహన్యాద్వా=విఃసొత్తును చెడఁగొట్టఁడో, తదన్నం సతామ్ సంమతమ్=అతనియన్నము సత్పురుషులకు ఇష్టమైనది-

తా॥ ఎవ్వఁడు ఈజ్ఞానియొక్క మనస్సునకు బాధనుకలుగఁజేయఁడో, ఈతని కృష్ణాజినము వస్త్రముదర్భములు మొదలగువానిని చెడఁగొట్టఁడో, వానియన్నమె తినఁదగినది-

నిత్యమజ్ఞాతచర్యామేఇతిమన్యేతబ్రాహ్మణః।
జ్ఞాతీనాంతువసన్మధ్యేతంవిదుర్బ్రాహ్మణంబుధాః॥౩౨॥

జ్ఞాతీనాం మధ్యేవసన్ బ్రాహ్మణః=జ్ఞాతుల నడుమ నున్న బ్రాహ్మణుఁడు, నిత్యమ్ అజ్ఞాతచర్యా మే (స్యాత్)ఇతి మన్యేత =ఎల్లప్పుడును అజ్ఞాతవాసము నాకు (కలుగవలయును) అని తల

చూచుండవలయును- బుధాః తమ్ బ్రాహ్మణం విదుః- తెలిసినవారు ఆతనిని బ్రహ్మజ్ఞునిగా తెలిసికొందురు-

తా॥ జ్ఞాతులమధ్యవిధిలేక తానుస్వంతవఱకుముకూడ నాకు ఎవ్వరికిని తెలియకుండునట్లు సంచరించుట ఎప్పుడు సంభవించునోయనియె కోరుచుండవలయును- ఇట్టివాఁడె బ్రహ్మజ్ఞాని-

ఇచ్చట శంకరభాష్యమున జ్ఞాతీనాంతువసన్మధ్యేనైవవిన్దేతకించన యనియుత్తరార్థము వరించఁబడినది- జ్ఞాతీనాంమధ్యేవసన్-జ్ఞాతుల నడుమ నున్నవాఁడై, కించన నైవవిందేత-ఏమియును పొందలేఁడు_అనిదానియర్థము ఇంతియెకాక అజ్ఞాతశబ్దమునకు మన ఇంద్రియములకుఁగానీ మనవాక్కునకుఁగానీ విషయముగాని పరబ్రహ్మమర్థము- జ్ఞాతిశబ్దమునకు ఇంద్రియములర్థము- కాఁగాపూర్ణానందస్వరూపుఁడగు పరబ్రహ్మమునందలి చర్యయనఁగా సమాధియె నేను ఆచరింపవలసినది- దేహేంద్రియాములలో అహంకారము నాకుండఁగూడదు- ఇంద్రియములలో నున్నవాఁడై అనఁగా నింద్రియ వ్యాపారములను చేయుచున్నవాఁడై బ్రహ్మము పొందఁడు- అనికూడ యోజన చేయఁబడినది-

కో హ్యేవమన్తరాత్మానం బ్రాహ్మణో మన్తుమర్హతి।
నిర్లిఙ్గమచలంశుద్ధంసర్వద్వంద్వవివర్జితమ్ ॥33॥

నిర్లిఙ్గమ్ అచలం శుద్ధమ్ సర్వద్వంద్వవివర్జితమ్ అన్తరాత్మానమ్-పుంస్త్రీనపుంసకలింగములు లేనివాఁడును నిర్వికారుఁడును పరిశుద్ధుఁడును ఆకలిదప్పిక మొదలగునవి లేనివాఁడునగు శరీరములోనియాత్మను, ఏవం మన్తుమ్ కోహి అర్హతి- ఇట్లు తలంచుటకు ఎవ్వఁడు తగును-

తా॥ ఆత్మకు పుంస్త్రీనపుంసకలింగములులేవు- ప్రకృతికివలె వికారములులేవు- కావుననె ఆత్మపరిశుద్ధుఁడు- ఆకలిదప్పిక మొదలగునవికూడ లేనివాఁడు- ఇవియన్నియును శరీరముతోఁజేరినవియె-ఇట్లుశరీరంబును ఆత్మయును పరస్పరవిలక్షణ స్వరూపములైయుండఁగా దేహమె ఆత్మయని ఎవ్వఁడు తలంపఁగలడు-

26-10-1895

నిర్లింగమ్ అనువానికి సూక్ష్మశరీర స్థూలశరీరములు లేని వాఁడు అనియర్థము. అచలుఁడనగా కర్తృత్వము మొదలగునవి లేనివాఁడు- శుద్ధుఁడనగా అవిద్యాదిదోషములు లేనివాఁడు.అని శంకర భాష్యము-

యోన్యథాసన్తమాత్మాన మన్యథాప్రతిపద్యతే।
కింతేననకృతంపాపంచోరేణాత్మాపహారిణా॥ 34॥

అన్యథా సన్తమ్ ఆత్మానమ్= మఱియొకవిధముగా నున్న ఆత్మను, యః అన్యథా ప్రతిపద్యతే= ఎవ్వఁడు మఱియొకవిధముగా తెలిసికొనుచున్నాఁడో, చోరేణ ఆత్మాపహారిణా తేన= దొంగయును ఆత్మనుఅపహరించినవాఁడునయిన వానిచేత, కిం పాపం నకృతం= ఏమి పాపము చేయఁబడకున్నది-

తా॥ జ్ఞానాదిస్వరూపుఁడైన ఆత్మనుశరీరాదికముగా తలంచి దొంగయనియును ఆత్మాపహారియనియును చెప్పఁదగినవానికంటె పాపిష్ఠుఁడు ఈలోకములో మఱియెవ్వఁడు- దొంగలించినవస్తువును పట్టికదా దొంగయొక్కదోషముఅతిశయించును- బంగారము మొదలయిన యచేతనములకంటె చేతనమైన యాత్మను దొంగలించిన వానిదొంగతనముగొప్పదికాదా.

అశ్రాంతఃస్యాదనాదాతాసమ్మతోనిరుపద్రవః।
శిష్టోనశిష్టవత్సస్యాత్ బ్రాహ్మణో బ్రహ్మవిత్కవిః ॥35॥

బ్రహ్మవిత్ కవిః బ్రాహ్మణః=బ్రహ్మజ్ఞుఁడును దూరదృష్టిగలవాఁడునగు బ్రాహ్మణుఁడు, అనాదాతా అశ్రాంతఃస్యాత్= ఆదాయము లేనివాఁడును శ్రమము లేనివాఁడును కావలయును- సః నిరుపద్రవః సమ్మతః= అతఁడుఉపద్రవములు లేనివాఁడుగా అంగీకరింపఁబడినవాడు. శిష్టః సః శిష్టవత్ నస్యాత్=శిష్టుఁడైన అతఁడు శిష్టునివలె నుండఁగూడదు-

తా॥ బ్రహ్మజ్ఞుఁడగువాఁడు సంపాదనము చేయుటకైశ్రమమును పొందఁగూడదు- ఇట్టివానికి విఘ్నములెవ్వియు కలుగవని పెద్దలో యున్నారు- తానుశిష్టుఁడైయున్నను అందఱకును శిష్టునివలెకన

బడఁగూడదు-

అనాదాతయన్నఁగా దేహేంద్రియాదులను ఆత్మగాస్వీకరింపనివాఁడు- అట్టివానికిసంసారశ్రమము కలుగదు- ఆకలిదప్పికమొదలగునవి దేహధర్మములుగాని ఆత్మధర్మములు కావుగదా- అని శంకరభాష్యము.

యేయథావాన్తమశ్నంతి శ్వానోనిత్యమభూతయే।
ఏవంతేవాన్తమశ్నన్తి స్వవీర్యస్యోపసేవనాత్ ॥౩౬॥

యే (శిష్టవత్ స్యుః) తే- ఎవ్వరు శిష్టులవలెనె ఉందురో వారు, శ్వానః యథా వాన్తమ్ అశ్నన్తి = కుక్కలు ఎట్లు వమనము చేసికొనినదానిని తినునో, స్వవీర్యస్య ఉపసేవనాత్ = తమసామర్థ్యమును వెల్లడిచేయుటవలన, ఏవం వాన్తమ్ అశ్నన్తి-ఇట్లు వమనముచేసికొనినదానిని తినుచున్నారు-

తా॥ తాముబ్రహ్మజ్ఞులమని తమమాహాత్మ్యమును వెల్లడిచేసికొని దానివలన వ్యవహరించువారు వమనము చేసికొనినదానిని తినెడికుక్కలవంటివారు-

అనాఢ్యామానుషేవిత్తే ఆఢ్యావేదేషుయేద్విజాః।
తేదుర్ధర్షాదుష్ప్రకంప్యాస్తాన్ విద్యాద్బ్రహ్మణస్తనుమ్॥౩౭॥

యే ద్విజాః=ఏబ్రాహ్మణులు, మానుషే విత్తే అనాఢ్యాః మనుష్యసంబంధియగు ధనమునందు ఆసక్తిలేనివారును, వేదేషు ఆఢ్యాః= వేదములలో ఆసక్తికలవారునో, తే దుర్ధర్షాః దుష్ప్రకంప్యాశ్చ భవన్తి- వారు తిరస్కరింపశక్యముకానివారును కదల్పశక్యముకానివారును అగుచున్నారు- తాన్ బ్రహ్మణః తనుమ్ విద్యాత్= వారిని బ్రహ్మముయొక్క శరీరమునుగా తెలిసికొనవలయును-

తా॥ మనుష్యులు ఆశపడఁదగిన భార్యాపుత్ర ధనాదులయందు ఆశలేనివారును వేదోక్తధర్మములగు అహింసాదులయందు ఆశకలవారును ఎవ్వరిచేతను తిరస్కరింపఁబడఁదగనివారును నిశ్చలులునగు జ్ఞానులు పరమేశ్వరుని యభిమానమునకు పాత్రులయినవారు- పరబ్రహ్మస్వరూపులనుగా వారిని తెలిసికొనవలయునని శం

కరభాష్యము.

సర్వాన్ స్విష్టకృతో దేవాన్ విద్యాద్య ఇహ కశ్చన ।
నసమానో బ్రాహ్మణస్య యస్మిన్ ప్రయతతే స్వయమ్ ॥ 3౮ ।

ఇహ యః కశ్చన స్విష్టకృతః సర్వాన్ దేవాన్ విద్యాత్ = ఈలోకమున ఎవ్వడైనను స్విష్టకృత్తులగు అందఱు దేవతలను ఎఱుంగునో, (సోఽపి) బ్రాహ్మణస్య నసమానః = (వాఁడుగూడ) బ్రహ్మవేత్తకు సమానుఁడుకాఁడు. సః యస్మిన్ స్వయం ప్రయతతే = ఆతండు ఏదేవతవిషయమున స్వయముగా ప్రవర్తించునో, సోఽపి నసమానః = ఆదేవతగూడ సమానముకాదు.

తా॥ ఇష్టఫలప్రదాతలగు దేవతలనందఱి నెఱిఁగినవాఁడై వారివలనకావలసిన ఫలమును సంపాదించికొనఁదగిన సామర్థ్యము కలవాఁడైన యజమానుఁడుగూడ బ్రహ్మజ్ఞునితో సమానుఁడుకాఁడు. ఇంతయేల. ఆఫలమునిచ్చెడి దేవతలుగూడ బ్రహ్మజ్ఞునకు సమానులుకారు.

యమప్రయతమానం తు మానయంతి స మానితః ।
న మాన్యమానో మన్యేత నావమానోఽనుసంజ్వరేత్ ॥ 3౯ ॥

అప్రయతమానం యం (సన్తః) మానయన్తి = ప్రయత్నమేమియును లేకున్న ఏబ్రహ్మజ్ఞుని సత్పురుషులు మన్నింతురో, మానితః సః = మన్నింపఁబడిన ఆతఁడు, (అహం) మాన్యమానః (ఇతి) నమన్యేత = (నేను) మన్నింపఁబడుచున్నవాఁడను (అని) తలంపఁగూడదు. అవమానః (ఏనం) నానుసంజ్వరేత్ = అవమానము ఈతనిని బాధింపగూడదు.

తా॥ ఇట్లు గూఢముగా సంచరింపుచున్నను బ్రహ్మజ్ఞుని బుద్ధిమంతులగువారు కనుగొని గౌరవింతురు. అట్లుగౌరవింపఁబడినప్పుడు నన్నుగౌరవించుచున్నారుగదా అని తాను సంతోషింపగూడదు. ఇక మూర్ఖులగువారు తన్ను అవమానించిన యెడను దానికై దుఃఖమును బొందఁగూడదు. మానావమానములు రెంటిను సమానముగా తలంపఁబడవలయును.

లోకస్వభావవృత్తిర్హి నిమేషోన్మేషవత్సదా।
విద్వాంసో మానయంతీహ ఇతి మన్యేత మానితః॥౪౦॥

ఇహ సదా విద్వాంసః మానయంతి (ఇత్యేతత్)= ఇచ్చట ఎల్లప్పుడును తెలిసినవారు మన్నింపుచుందురు (అనునది), నిమేషోన్మేషవత్ లోకస్వభావవృత్తిర్హి= కన్నుమూయుట తెఱచుటవలె లోకస్వభావవ్యాపారముగదా, ఇతి మానితః మన్యేత= ఇట్లు మన్నింపఁబడినజ్ఞాని తలంచును-

తా॥ బ్రహ్మజ్ఞుఁడు తన్ను తెలిసినవారు మన్నించినప్పుడు అనుకొనవలసిన దేమన్నను, జంతువులన్నిటికిని ఱెప్పపాటుఎట్లు స్వాభావికమో అట్లుసత్పురుషులు జ్ఞానులను మన్నించుటకూడస్వాభావికమే యనితలంచునది-

అధర్మవిదుషో మూఢా లోకశాస్త్రవివర్జితాః।
న మాన్యం మానయిష్యంతి ఏవం మన్యేదమానితః॥౪౧॥

అధర్మవిదుషః లోకశాస్త్రవివర్జితాః మాన్యానామ్ అవమానినః మూఢాః= అధర్మము నెఱింగినవారును లోకవ్యవహారంబును శాస్త్రంబునుఎఱుంగనివారును మన్నింపదగినవారిని అవమానించుటయె స్వభావముగాఁగలవారునగు మూఢులు, మాన్యం న మానయిష్యంతి=మన్నింపఁదగినవానిని మన్నింపరు- ఏవమ్ అమానితః మన్యేత్ =ఇట్లు అవమానముచేయఁబడినవాఁడై తలంచునది-

తా॥ మూర్ఖులగువారు తన్నుమన్నింపకుండునప్పుడు జ్ఞాని యిట్లనుకొనవలయును- వీరుధర్మము నెఱుంగరు- లోకజ్ఞానశాస్త్రజ్ఞానంబులు వీరలకు లేవు- కావుననె వీరుమన్నింపదగినవారిని అవమానించుటయెస్వభావముగాఁగల అజ్ఞానులు అని అనుకొనవలయును గాని ఆయవమానమును సరకుజేయఁగూడదు-

మన్యేతఅనియుండవలసినదానికి మన్యేత్అనియుండుట ఆర్షప్రయోగము-

నవైమానంచమౌనంచసహితౌవసతస్సదా।
అయంహిలోకోమానస్యహ్యసౌమౌనస్యతద్విదుః॥౪౨॥

మౌనంచ మౌనంచ సహితౌ సదా నవసతోవై- మౌనంబును మౌనంబును ఒకదానితోనొకటిచేరినవై ఎల్లప్పుడును ఉండవుగదా మౌనస్య అయంలోకోహి= మౌనమునకు ఈలోకముగదా- మౌనస్య అసౌలోకః= మౌనమునకు ఆ లోకము తత్ (విద్వాంసః) విదుః= దానిని (జ్ఞానులు) ఎఱుఁగుదురు-

తా॥ మౌనమునుగోరువానికి ఈలోకముననె ఫలముగలుగును గాని పరలోకమునఁగలుగదు- మౌనముగలవానికి పరలోకముననె ఫలసిద్ధియగును- కావున రెండును ఒకనికిసంభవింపవు-

సహితే అనునపుంసకలింగముండవలసినదానికి సహితౌ అని యుండుట ఆర్షప్రయోగము-

తత్ అనుశబ్దము పరబ్రహ్మమును జెప్పును- తచ్ఛబ్దవాచ్యమగు పరబ్రహ్మము మౌనమునకు విషయమగునని యర్థము శంకరభాష్యమున వ్రాయఁబడినది.

శ్రీర్హి మానార్థ సంవాసాత్సాచాపి పరిపన్థినీ।
బ్రాహ్మీసుదుర్లభా శ్రీర్హి ప్రజ్ఞాహీనేన క్షత్రియ॥౪౩॥

మానార్థసంవాసాత్ శ్రీర్హి భవతి= మానముకొఱకునివసించుట వలన సంపదగదా కలుగును- సాచాపి పరిపన్థినీ= ఆసంపద అడ్డు చేయునదియె- హే క్షత్రియ= ఓక్షత్రియుండా, ప్రజ్ఞాహీనేన బ్రాహ్మీ శ్రీః సుదుర్లభాహి= జ్ఞానహీనునిచేత బ్రహ్మసంబంధియగు సంపద బొత్తిగా పొందశక్యముకానిదిగదా-

తా॥ మానమునకై కర్మాదుల నాచరించువానికి సంపదకలుగును- అదిమంచిమార్గమునకు ప్రతిబంధకమైనది- ఇట్లు సంపదకై విషయములయందు ప్రవర్తించువాఁడు బ్రహ్మానందమనెడి సంపదను పొందఁజాలఁడు-

ద్వారాణి తస్యేహ వదంతి సంతో
బహుప్రకారాణి దురాసదాని।
సత్యార్జవే హ్రీర్దమ శౌచ విద్యాః
షణ్మాన మోహ ప్రతిబంధకాని॥౪౪॥

ఇహా సన్తః — ఈలోకమున సత్పురుషులు, సత్యార్జవే హ్రీః దమ శౌచవిద్యాశ్చేతి షట్ — సత్యంబును ఆర్జవంబును సిగ్గును దమంబును శౌచంబును విద్యయునను నాఱింటని, బహుప్రకారాణి దురాసదాన్యభిమాన మోహాప్రతిబంధకాని తస్య ద్వారాణి వదంతి — అనేకప్రకారములు కలవియును పొందశక్యముకానివియును మానమును అజ్ఞానమునను పోఁగొట్టునవియునగు ఆమోక్షముయొక్క ద్వారములనుగా చెప్పుచున్నారు.

తా॥ సత్యము మొదలగునవియాఱును బ్రహ్మానందసంపదను పొందుటకు ద్వారములనుగా జెప్పుచున్నారు. ఇవి అభిమానమునను అజ్ఞానమునను పోఁగొట్టునవి. ఒక్కొక్కటి అనేకవిధములుగా నుండునవి. సులభముగా సాధ్యములు కానివి.

సత్యమనఁగా ప్రాణులకు హితమైన యథార్థమును చెప్పుట. ఆర్జవమనఁగా కౌటిల్యము లేకపోవుట. అనగా లోపల వెలుపల గూడ నొకవిధముగా ప్రవర్తించుట. హ్రీయనఁగా అకార్యములను జేయుటలో సిగ్గు. దమమనఁగా అంతఃకరణమును నిగ్రహించికొనుట. బాహ్యేంద్రియములను నిగ్రహించుట దమమనికొందఱి తాత్పర్యము. శౌచమనఁగా నిర్మలుఁడై యుండుట. విద్యయనఁగా బ్రహ్మజ్ఞానము.

ఇతి సనత్సుజాతీయపర్వణి ద్వితీయోధ్యాయః॥
ఇది సనత్సుజాతీయపర్వంబున రెండవయధ్యాయము.

సనత్సుజాతపర్వము.

3 అధ్యాయము-

ధృతరాష్ట్ర ఉవాచ- ధృతరాష్ట్రుఁడు పలికెను-

కస్యైష మౌనః కతరన్ను మౌనం
ప్రబ్రూహి విద్వన్నిహ మౌనభావమ్।
మౌనేన విద్వానుత యాతి మౌనం
కథం మునే మౌనమిహాచరంతి ॥౧॥

ఏషః మౌనః కస్య- ఈమౌనము ఎవ్వరికి?, మౌనం కతరన్ను= మౌనము ఎట్టిది?, హే విద్వన్ ఇహ మౌనభావం ప్రబ్రూహి= ఓపండితుఁడా ఇచ్చట మౌనస్వభావమును చెప్పుము- ఉత= లేక, విద్వాన్ మౌనేన మౌనమ్ యాతి= జ్ఞానియగువాఁడు మౌనముచేత మౌనమును పొందునా?, హే మునే ఇహ మౌనం కథమ్ ఆచరన్తి= ఓమునీ ఇచ్చట మౌనమును ఎట్లు ఆచరింపుచున్నారు

తా॥ ఎవ్వనికి ఇట్టి మౌనము కలుగును- మౌనమన్నది మాటలాడకయుండుటగా లేక ఆత్మస్వరూపజ్ఞానమా- ఈరెండిటిలోనేది మౌనము- దానిస్వభావమెట్టిది- మౌనముచేత పరబ్రహ్మమును పొందునా యేమి· మిగిలినవారందఱును మౌనమునెట్లు ఆచరింతురు.

సనత్సుజాత ఉవాచ= సనత్సుజాతుఁడు పలికెను-

యతో న వేదా మనసా సహైన
మనుప్రవిశంతి తతోథ మౌనమ్।
యత్రోత్థితో వేదశబ్దస్తథాఽయం
స తన్మయత్వేన విభాతి రాజన్ ॥౨॥

వేదాః మనసా సహ ఏనం యతః న అనుప్రవిశంతి- వేదములు మనస్సుతోఁగూడ ఈతనిని ఎందువలన చొరఁజాలవో, అథ తతః మౌనమ్ (ఇత్యుచ్యతే)= ఇఁకను అందువలననె మౌనమని చెప్పఁబడుచున్నది- తథా అయం వేదశబ్దః యత్ర ఉత్థితః- అట్లే ఈవేదములనెడి శబ్దపమాణము దేనివిషయమున ఆవిర్భవించినదో, హే రాజన్ సః త

న్మయత్వేన విభాతి— ఓరాజా ఆతఁడు వేదమయుఁడుగాఁ దోఁచుచున్నాఁడు

తా॥ మౌనశబ్దమునకు పరబ్రహ్మమే యర్థము- ఆపరబ్రహ్మమును మనమనస్సులు గ్రహింపఁజాలవు- వేదములుగూడ ఆతనిస్వరూపము నంతటిని తెలియఁజేయఁజాలవు- అయినను మనకు ఆపరబ్రహ్మమును తెలిసికొనుటకు వేదమె ఆధారము- కావుననె ఆతఁడు వేదమయుఁడని చెప్పఁబడుచున్నాఁడు-

వేదశబ్దః యత్రి ఉత్థితః— వేదము ఎవ్వనియందు కలిగినదో, అనఁగా వేదములకు కారణమైనవాఁడు పరబ్రహ్మమనుట- అనియును యోజనచేయవచ్చును- పరమాత్మ జ్ఞానస్వరూపుఁడైనను, తన్మయత్వేన= జ్యోతిస్స్వరూపుఁడుగా మాకుతోఁచుచుండును- ఇదియె మాయనుభవము- దీనియెడను అవిశ్వాసముంచకుము అనియైనను, శ్రుత్యాదులలో జ్యోతిర్మయుఁడుగా తెలియఁజేయఁబడుచున్నాఁడనియైనను చెప్పవచ్చును- అని శంకరభాష్యము-

ధృతరాష్ట్రఉవాచ= ధృతరాష్ట్రుఁడు పలికెను-

ఋచోయజూంష్యధీతేయస్సామవేదంచయోద్విజః।
పాపానికుర్వన్ పాపేనలిప్యతేనసలిప్యతె॥ ౩॥

యః ద్విజః= ఎవ్వఁడు బ్రాహ్మణుఁడో, యః ఋచః యజూంషి సామవేదంచ అధీతె= ఎవ్వఁడు ఋక్కులను యజుస్సులనను సామవేదమును చదువుచున్నాఁడో, సః పాపాని కుర్వన్= వాఁడు పాపములను చేయుచున్నవాఁడై, పాపేన లిప్యతేవా నలిప్యతేవా= పాపముచేత సంబంధింపఁబడునా సంబంధింపఁబడఁడా.

తా॥ ఋగ్వేదాదులను జదువువాఁడు పాపములను జేసినయెడను ఆపాపములు వానికి అంటునా అంటవా-

సనత్సుజాతఉవాచ= సనత్సుజాతుఁడు పలికెను-

నైనంసామాన్యృచోవాపియజూంషిచవిచక్షణమ్।
త్రాయంతేకర్మణఃపాపాన్నతేమిథ్యాబ్రవీమ్యహమ్॥ ౪॥

సామాని ఋచః అపిచ యజూంషివా= సామములైనను ఋక్కులై

2-11-1895.

యినను ఇంతియేకాక యజుస్సైనను, ఏనం విచక్షణం పాపాత్ కర్మణః నత్రాయన్తే- ఈ పండితుని పాపకర్మమునుండి రక్షింపవు. అహం తే మిథ్యా న బ్రవీమి= నేను నీకు అసత్యమును చెప్పను-

తా॥ సామవేదాములం జదివికొని పండితుఁడైనవాఁడును యథేష్టముగా సంచరించినయెడను పాపములు పోకకమానవు- ఇది సత్యము-

నచ్ఛందాంసివృజినంతారయన్తి
మాయావినంమాయయావర్తమానమ్।
ఛందాంస్యేనంప్రజహత్యంతకాలే
నీడంశకుంతాఇవజాతపక్షాః॥౫॥

వృజినం మాయావినం మాయయా వర్తమానం ఏనమ్- పాపములను చేయువాఁడును మోసగాఁడును మోసముతోడనె ప్రవర్తింపుచున్నవాఁడునను వీనిని, ఛన్దాంసి నతారయన్తి= వేదములు తరింపఁజేయవు- జాతపక్షాః శకున్తాః నీడమివ= ఱెక్కలువచ్చిన పిట్టలు గూడునువలె, ఛందాంసి అంతకాలే ఏనం ప్రజహాతి= వేదములు అంతకాలమున వీనిని విడుచుచున్నవి-

తా॥ ధర్మములేదనుకొనినాస్తికుఁడై పాపములను చేయుచు వేదములను చదివి వానియర్థములను తెలిసికొన్నవాఁడును దాంభికుఁడునగువానిని వేదములు రక్షింపఁజాలవు- విడుచుచున్నప్పుడు పిట్టలు ఱెక్కలు వచ్చినపై తమగూడును విడిచిపెట్టినట్లు వీనినివిడిచిపెట్టును.

ధృతరాష్ట్ర ఉవాచ= ధృతరాష్ట్రుఁడు పలికెను.

నచేద్వేదా వేదవిదంత్రాతుంశక్తావిచక్షణ।
అథకస్మాత్ప్రలాపోయం బ్రాహ్మణానాం సనాతనః॥౬॥

హే విచక్షణ=ఓపండితుఁడా, వేదాః వేదవిదం త్రాతుంశక్తాః నభవన్తి చేత్= వేదములు వేదములనెఱిఁగినవాని రక్షింపను సమర్థములు కాకున్నవేని, అథ= ఇఁకను, బ్రాహ్మణానాం సనాతనః అయం ప్రలాపః కస్మాత్- బ్రాహ్మణుల ప్రాచీనమైన ఈ మాట ఏల.

తా॥ వేదములు రక్షింపలేనియెడల, బ్రాహ్మణులశ్రమమును జేసి ఈవేదములను చాలకాలమునుండి చదువుకొనుచున్నారే, ఈ చదువు పల.

సనత్సుజాతఉవాచ— సనత్సుజాతుఁడు పలికెను-

తస్యైవనామాదివిశేషరూపై
రిదంజగద్భాతిమహానుభావ ।
నిర్దిశ్యసమ్యక్ప్రవదంతివేదా
స్తద్విశ్వవైరూప్యముదాహరంతి ॥ ౨॥

హే మహానుభావ— ఓ మహానుభావుఁడా, తస్య నామాది విశేష రూపైరేవ ఇదం జగత్ భాతి— ఆపరమేశ్వరుని నామములు మొదలగు విశేషరూపముల చేతనే ఈజగత్తు ప్రకాశించుచున్నది- తత్ సమ్యక్ నిర్దిశ్య వేదాః ప్రవదంతి—దానిని తెన్నగా నిర్దేశించి వేదములు చెప్పుచున్నవి— తత్ విశ్వవైరూప్యమ్ ఉదాహరన్తి— ఆ బ్రహ్మమును ప్రపంచముకన్నవిలక్షణమయిన స్వరూపముగలదానినిగా చెప్పుచున్నారు

తా॥ ఆపరమేశ్వరునివలనఁగలిగిన నామరూపములతోనే ఈ జగత్తంతయును ప్రకాశించుచున్నది- ఈయంశమునె తెన్నగా వేదములు తెలియఁజేయుచున్నవి. ఇంతియెకాక మహాత్ములుగూడ ఆయీశ్వరునిస్వరూపము జగత్తుకంటె విలక్షణమైనదని చెప్పుచున్నారు- కావున వేదమువలన పరమాత్మస్వరూపమును తెలిసికొని పరమాత్మధ్యానము చేయవలయునుగాని వట్టి వేదాధ్యయనము కార్యకరముకాదనుట-

ఆపరమాత్మయె మాయచేత కల్పించికొనిన నామాదులతో నీజగత్తుగా ప్రకాశింపుచున్నాఁడు, అనిచెప్పి ఆపరబ్రహ్మము యొక్క స్వరూపమును గూడ వేదములె తెలియఁజేయుచున్నవి- ఇంతియెకాక మహామునులుగూడ ఆబ్రహ్మస్వరూపము జగత్తుకంటె విలక్షణమైనదని చెప్పుచున్నారు- అనిశంకరభాష్యము

తథ ధర్మముక్తంతపపతదజ్యా

తాభ్యామసౌపుణ్యముపైతివిద్వాన్।
పుణ్యేనపాపంవినిహత్యపశ్చాత్
సజాయతేజ్ఞానవిదీపితాత్మా॥౮॥

ఏతత్ తపః తదర్థమ్ ఉక్తమ్= ఈ తపస్సు ఆతనికొఱకె చెప్పఁబడినది- ఇజ్యాచ తదర్థా ఉక్తా= యజ్ఞంబును ఆతనికొఱకె చెప్పఁబడినది- అసౌవిద్వాన్ తాభ్యామ్ పుణ్యమ్ ఉపైతి= ఈపండితుఁడు వానివలన పుణ్యమును పొందుచున్నాఁడు- సః పుణ్యేన పాపం వినిహత్య=వాఁడు పుణ్యము చేతను పాపమును పోఁగొట్టుకొని, పశ్చాత్ జ్ఞానవిదీపితాత్మా జాయతే- ఆవెంటను జ్ఞానము చేతప్రకాశింపఁజేయఁబడినస్వరూపముగలవాఁడు అగుచున్నాఁడు-

తా॥ వేదమున తపస్సును యజ్ఞంబునుగూడ పరమేశ్వరారాధనముకొఱకె అని చెప్పబడినది- అట్లు వానినాచరించువాఁడు ఆపుణ్యమువలన తనపాపములనన్నిటిని పోఁగొట్టుకొని దానివలన ఈశ్వరజ్ఞానము కలవాఁడై ప్రకాశించును- కావున వేదములోఁ జెప్పినచొప్పున నడచిన యెడను కార్యకరమగునుగాని వట్టివేదాధ్యయనము కార్యకరముకాదనుట-

జ్ఞానేనచాత్మానముపైతివిద్వా
నథాన్యథావర్గఫలానుకాంక్షీ।
అస్మిన్ కృతంతత్పరిగృహ్యసర్వ
మముత్రభుజ్క్తే పునరేతిమార్గమ్॥౯॥

విద్వాన్ జ్ఞానేన ఆత్మానమ్ ఉపైతి= జ్ఞానియగువాఁడు జ్ఞానముచేత ఆత్మను పొందుచున్నాఁడు- అథ అన్యథావర్గఫలానుకాంక్షీ= ఇఁకను మఱియొకవిధముగా పుణ్యఫలమును గోరుచున్నవాఁడు, అస్మిన్ కృతం తత్సర్వమ్ పరిగృహ్య= ఈలోకమున చేయబడిన దానినంతయును స్వీకరించుకొని, అముత్ర భుజ్క్తే= పరలోకమున అనుభవించును- పునః మార్గమ్ ఏతి= తిరిగియు సంసారమార్గమును పొందుచున్నాఁడు-

తా॥ ఇట్లు పరమేశ్వరారాధనరూపముగాఁ గర్మములఁ జేయు

వాఁడు జ్ఞానముచేత పరమాత్మను పొందును- మోక్షమును పొందుననుట- అట్లుగాక స్వర్గాదిఫలములం గోరి కర్మముల నాచరించెడి యజ్ఞాని తాను సంపాదించుకొనిన పుణ్యముతో స్వర్గలోకముఁ జేరి అచ్చట ఆపుణ్యమున్నంతవఱకు ఫలము ననుభవించును- అటపైని మిగిలిన కర్మముతో సంసారముం జేరును-

అస్మిన్ లోకే తపస్తప్తం ఫలమన్యత్ర భుజ్యతే ।
బ్రాహ్మణానాం తపస్స్వృద్ధమన్యేషాం తావదేవ తత్ ॥౧౦॥

అస్మిన్ లోకే తపః తప్తం (భవతి)= ఈ లోకమున తపస్సు ఆచరింపఁబడినది (అగుచున్నది)- ఫలమ్ అన్యత్ర భుజ్యతే= ఫలము మఱియొకచోటను అనుభవింపఁబడును- బ్రాహ్మణానాం తపః ఋద్ధం (భవతి)= బ్రహ్మజ్ఞానముకలవారల తపస్సు ఎదిగినది (అగుచున్నది)- అన్యేషాం తత్ తావదేవ (భవతి)= ఇతరులకు అది అంతే (అగుచున్నది)

తా॥ బ్రహ్మజ్ఞానముకలవారైనను లేనివారైనను ఈలోకమునఁ జేసిన తపస్సుయొక్క ఫలమును పరలోకమునఁ బొందుట నిశ్చితము. బ్రహ్మజ్ఞానము కలవాని తపస్సు దానికిఁ జెప్పియున్నఫలముకంటె మిక్కుటమైన ఫలము కలదియగును- అజ్ఞానులతపస్సు దానికెంత ఫలము చెప్పఁబడియున్నదో అంతఫలము కలదెయగును- బ్రహ్మజ్ఞానుల తపస్సు మోక్షమును కలుగఁజేయును- అజ్ఞానుల తపస్సు స్వర్గాదులను కలుగఁజేయుననుట-

ధృతరాష్ట్ర ఉవాచ- ధృతరాష్ట్రుఁడు పలికెను.

కథం సమృద్ధమత్యృద్ధం తపో భవతి కేవలమ్ ।
సనత్సుజాత తద్బ్రూహి కథం విద్యామహం ప్రభో ॥౧౧॥

తపః సమృద్ధమ్. అపి చ ఋద్ధమ్ కేవలం చ కథం భవతి= తపస్సు సమృద్ధంబును ఇంతియెకాక ఋద్ధంబును కేవలంబును ఎట్లు అగుచున్నది? హే సనత్సుజాత తత్ బ్రూహి= ఓ సనత్సుజాతుఁడా దానిని చెప్పుము- హే ప్రభో అహం కథం విద్యామ్= ఓ ప్రభువా నేను ఎట్లు తెలిసికొందును.

తా॥ తపస్సు కేవలంబును బుద్ధంబును సమృద్ధంబునగుట యెట్లో దానిని చెప్పుము.

సనత్సుజాత ఉవాచ— సనత్సుజాతుడు పలికెను.

నిష్కల్మషం తపస్త్వేతత్కేవలం పరిచక్షతే।
ఏతత్సమృద్ధమప్యృద్ధం తపో భవతి కేవలమ్॥౧౨॥

నిష్కల్మషమ్ ఏతత్ తపః= కల్మషములు లేని ఈ తపస్సును, కేవలం పరిచక్షతే= కేవలమునుగాను చెప్పుచున్నారు. ఏతత్ కేవలం తపః= ఈ కేవలమైన తపస్సు, సమృద్ధమ్ అపి చ బుద్ధమ్ భవతి— సమృద్ధంబును మఱియును బుద్ధంబును అగుచున్నది.

తా॥ నిర్దోషమైన తపస్సు కేవలమని చెప్పఁబడును. అది యె ఫలమును గోరి చేయఁబడినయెడను సమృద్ధమగును- ఫలమును గోరక చేయఁబడినయెడను బుద్ధమగును- నిర్దోషమైన తపస్సు కోరిన ఫలమును గూడ ఈఁజాలను-

తపోమూలమిదం సర్వం యన్మాం పృచ్ఛసి క్షత్రియ।
తపసా హ్యేవ విద్వాంసః పరం త్వమృతమాప్నుయుః॥౧౩॥

హే క్షత్రియ మాం యత్ పృచ్ఛసి= ఓ క్షత్రియుఁడా నన్ను ఏది అడుగుచున్నావో, ఇదం సర్వం తపోమూలమ్= ఇది అంతయును తపస్సె మూలముగా కలది- విద్వాంసః పరమ్ అమృతమ్ తపసైవ హి ఆప్నుయుః= జ్ఞానులు గొప్ప అమృతమును తపస్సు చేతనె పొందుదురు-

తా॥ నీవు అడిగిన ఫలములన్నిటిని ఇచ్చునది తపస్సె- ఇది కాక మోక్షానందమును గూడ తపస్సు చేతనె జ్ఞానులు పొందియున్నారు-

ధృతరాష్ట్ర ఉవాచ= ధృతరాష్ట్రుఁడు పలికెను.

కల్మషం తపసో బ్రూహి శ్రుతం నిష్కల్మషం తపః।
సనత్సుజాత యేనేదం విద్యాం గుహ్యం సనాతనమ్॥౧౪॥

హే సనత్సుజాత నిష్కల్మషం తపః త్వయా శ్రుతమ్= ఓ సనత్సుజాతుడా నిష్కల్మషమైన తపస్సు నీచేత వినఁబడినది- తపసః క

ల్మషం బ్రూహి= తపస్సుయొక్క కల్మషమును చెప్పుము- యేన ఇ
దమ్ సనాతనం గుహ్యం విద్యామ్= ఏయుపదేశముచేత ఈ సనా
తనమైన రహస్యమును తెలిసికొందునో-

తా॥ తపస్సు నిష్కల్మషముగా నుండవలెనని చెప్పితివి- ఆ కల్మషమెద్దియో నాకు చెప్పుము- దీనివల్ల నేను జ్ఞానుల నిత్యమైన రహస్యమును తెలిసికొన్నవాఁడనగుదును-

ఏనిష్కల్మషతపస్సు చేత పరబ్రహ్మమును నే నెఱుఁగుదునో అని శంకర భాష్యము-

సనత్సుజాత ఉవాచ= సనత్సుజాతుఁడు పలికెను-

క్రోధాదయోద్వాదశయస్యదోషా
స్తథానృశంసానిచసప్తరాజన్।
జ్ఞానాదయోద్వాదశచాతతానా
శాస్త్రేగుణాయెవిదితాద్విజానామ్॥౧౫॥

హే రాజన్= ఓరాజా, యస్య క్రోధాదయః ద్వాదశ దోషాః= ఏ తపస్సునకు క్రోధము మొదలగు పండ్రెండు దోషములో, తథా తస్య సప్తనృశంసానిచ దోషాః= అట్లే ఆతపస్సునకు ఏడు నృశంసములు కూడ దోషములు- తతానాః శాస్త్రే విదితాః జ్ఞానాదయః ద్విజానాం ద్వాదశ గుణాః యే (సన్తి)= విస్తరింపఁజేయబడినవియును వేదమునప్రసిద్ధములైనవియును జ్ఞానము మొదలయినవియు నగు బ్రాహ్మణులయొక్క పండ్రెండు గుణములు ఏవి (కలవో), తాన్ వా వక్ష్యామి= వానినిగూడ చెప్పెదను-

తా॥ తపస్సునకు కల్మషములని చెప్పఁబడిన దోషములు క్రోధాదులు పండ్రెండును నృశంసములు ఏడు ననునవియె- ఇవిగాక జ్ఞానము మొదలయిన పండ్రెండుగుణములు వేదలోక ప్రసిద్ధములుగా నున్నవి- ఆదోషములను ఈ గుణములనుగూడ నీకు చెప్పెదను-

క్రోధఃకామోలోభమోహౌవిదిత్సా
కృపాసూయామానశోకౌస్పృహాచ।
ఈర్ష్యాజుగుప్సాచమహాగుణేన

సదావర్జ్యా ద్వాదశైతే నరేణ ॥౧౬॥

క్రోధః కామః లోభమోహౌ వివిత్సా= క్రోధంబును కామంబును లోభమోహంములును వివిత్సయును, కృపా అసూయా మానరోషౌ స్పృహా చ= కృపయును అసూయయును మానరోషంబులును స్పృహయును, ఈర్ష్యా జుగుప్సా చైతే ద్వాదశ= ఈర్ష్యయు జుగుప్సయు ననెడి ఈ పన్నెండును, మహాగుణేన నరేణ సదా వర్జ్యాః= గొప్పగుణములుగల మనుష్యుని చేత ఎల్లప్పుడును విడువఁదగినవి-

తా॥ క్రోధాదులు పండ్రెండును మంచిగుణములుగల వానిచే విడువఁదగినవి- క్రోధమనునది తనకోరికకు ప్రతిబంధము కలుగుటచేత కలిగి కొట్టుట తిట్టుట అహంకారము వినిసి కలుగఁజేసెడి దోషము- ఇది కామమునకు హాని కలుగుటవలనఁగూడ కలుగును. కామమనఁగా స్త్రీలు మొదలగు వారలయందు కలిగెడి అభిలాషము- ఇది మనస్సు స్థిమితముగానుండకపోవుట ఒడలు చెమటపట్టుట వడఁకు మొదలగు చిహ్నములు కలది_ పరద్రవ్యమును గోరుటగాని తాన్యాయముగా సంపాదించిన ధనమును తగినయెడలను వినియోగము చెయలేకపోవుటగాని లోభమనఁబడును- చేయఁదగినకార్యంబును చేయరాని కార్యంబును తెలియకుండుట మోహము- విషయముల రుచులను తెలిసికొనఁగోరుట వివిత్స- కృపయనఁగా తనవారలయెడను స్నేహము కలిగియుండుట- గుణములయెడను దోషములను ప్రసిద్ధిజేయుచుండుటయును పరులగుణములను సహింపలేకపోవుచుండుటయును అసూయ- తన్నుగొప్ప చేసికొనుట మానము- తనకిష్టమగునది లేకపోవుటచేత అంతఃకరణమునకు కలిగెడి క్షోభము శోకమనఁబడును- దీనికియేడ్చుట చింతించుట మొదలగునవిగురుతులు- ఇదియుటి ప్రతిక్రియలేని విషయములలోఁగలుగుచుండును- విషయానుభవమునందలి కోరిక స్పృహ- పరులశ్రేయస్సును సహింపలేకపోవుట ఈర్ష్య- పరగుణములను లేవనిచెప్పుచుండుట జుగుప్స-

శంకరభాష్యమున అకృపాఅనిపదచ్ఛేదము చేయఁబడినది.

ప డుచుండుట యని వివరింపఁబడినది మూఁడవ అ॥౧౪ శ్లో॥ కమునకు
ప్రయని యొయున్నది గాని ఇచ్చటను నుకృపా అని పదచ్ఛేదము గూడ
చేయవచ్చును-

ఏకైకమేతే రాజేంద్ర మనుష్యంపర్యుపాసతే।
లిప్సమానోన్తరం తేషాం మృగాణామివ లుబ్ధకః॥౧౭॥

మృగాణామ్ అంతరం లిప్సమానాః లుబ్ధకా ఇవ= మృగముల యొక్క ఛి
ద్రమును పొందఁగోరుచున్న వేటకాండ్రవలె, తేషాం అన్తరమ్ లిప్స
మానాః ఏతే= ఆ మనుష్యుల ఛిద్రమును పొందగోరుచున్న ఈ క్రో
ధాదులు, హే రాజేంద్ర ఏకైకం ఏతే మనుష్యం పర్యుపాసతే=ఓ
రాజశ్రేష్ఠుఁడా ఒక్కటియొక్కటిగా ఇవి మనుష్యుని ఆశ్రయించు
చున్నవి-

తా॥ వేటకాండ్రు సందు చూచుకొని మృగములను చంపునట్లు
ఈ క్రోధాదులును సందు చూచుకొని మనుష్యుని బాధించును-

వికత్థనః స్పృహయాళుర్మనస్వీ
బిభ్రత్కోపం చపలో౽రక్షణశ్చ।
ఏతాన్ పాపాః షణ్ణరాః పాపధర్మాన్
ప్రకుర్వతే నో త్రసన్తః సుదుర్గే॥౧౮॥

వికత్థనః స్పృహయాళుః మనస్వీ= తన్ను శ్లాఘించుకొనువాఁడు
ను మిగుల ఆశకలవాఁడును అభిమానము కలవాఁడును, కోపం బిభ్రత్
చపలః అరక్షణశ్చ= కోపమును ధరించుచున్నవాఁడును చాపలముక
లవాఁడును జాగ్రత్త లేనివాఁడును, ఇత్యేతే షట్ నరాః= అవెడి
యీ ఆఱుగురు మనుష్యులు, ఏతాన్ పాపధర్మాన్ ప్రకుర్వతే=
ఈ పాపధర్మములను చేయుచుందురు- సుదుర్గే అత్రి సన్తః నప్ర
వర్తన్తే=బొత్తిగా చేరశక్యము కాని ఈమార్గమున సత్పురుషులు ప్ర
వర్తింపరు-

తా॥ క్రోధాదుల నాచరించువారు ఎవ్వరన్నను, తన్ను తాను
పొగడికొనువాఁడు మొదలగు నాఱుగురే- సత్పురుషులగు వారు, బొ
త్తిగా జొరఁగూడని ఈ క్రోధాదిమార్గమున ప్రవేశింపరు-

18-10-1895.

ఈ శ్లోకము శంకరభాష్యమున వ్యాఖ్యానము చేయఁబడలేదు.

సంభోగసంవిద్విషమేధమానో
దత్తానుతాపీకృపణో బలీయాన్।
వర్గప్రశంసీవనితాంచద్వేష్టా
ఏతేపరేసప్తనృశంసరూపాః॥౧౯॥

సంభోగసంవిత్ ద్విషమ్ ఏధమానః= సంభోగమునందు బుద్ధికలవాడును శత్రుత్వముతో వృద్ధిబొందుచున్నవాఁడును, దత్తానుతాపీ కృపణః అబలీయాన్= ఇచ్చివేసినదానికై బాధపడువాఁడును కృపణుఁడును బుద్ధిబలము లేనివాఁడును, వర్గప్రశంసీ వనితాం ద్వేష్టా చేతి= ఇంద్రియవర్గములను ప్రశంసించువాఁడును తనభార్యను ద్వేషించువాఁడుననెడి, ఏతే పరే సప్త నృశంసరూపాః (భవన్తి)= వీరు మిగిలిన ఏడుగురు నృశంసులు (అగుచున్నారు).

తా॥ భోగానుభవమునందు బుద్ధిగలవాఁడు మొదలగు నేడుగురు వెనుకఁ జెప్పఁబడని సప్తనృశంసులు. కృపణుఁడనగా స్వల్పలాభమునకై ఎంతయవమానమునైనను సహించువాఁడు.

శంకరభాష్యమున (విషమ్ ఏధమానః) విషమువలె పరులకు బాధనే చేయుచు వృద్ధిబొందుచున్నవాఁడు అనికూడ నర్థము వ్రాయఁబడినది.

జ్ఞానంచసత్యంచదమఃశ్రుతంచ
హ్యమాత్సర్యంహ్రీస్తితిక్షానసూయా।
యజ్ఞశ్చదానంచధృతిశ్శమశ్చ
మహావ్రతాద్వాదశబ్రాహ్మణస్య॥౨౦॥

జ్ఞానంచ సత్యంచ దమః శ్రుతంచ= జ్ఞానంబును సత్యంబును దమంబును చదువును, అమాత్సర్యం హ్రీః తితిక్షా అనసూయా= మత్సరములేకపోవుటయును సిగ్గును ఓరిమియును అసూయలేకపోవుటయును, యజ్ఞశ్చ దానంచ ధృతిః శమశ్చ= యజ్ఞంబును దానంబును ధైర్యంబును శాంతియును, బ్రాహ్మణస్య ద్వాదశ మహావ్రతాః= బ్రాహ్మణునకు పండ్రెండు మహావ్రతములు.

తా॥ జ్ఞానాదయోద్వాదశవాతతానాః అని ౧౪వ శ్లోక

మున్ జెప్పఁబడిన జ్ఞానాదులు పండ్రెండునివియె- జ్ఞానమనఁగా తత్త్వమును తెలిసికొనుట- సత్యమనఁగా ప్రాణులకు హితమైన యథార్థమును చెప్పుట- దమమనఁగా మనోనిగ్రహము- శ్రుతమనఁగాపరమార్థమును తెలియఁజేసెడి శాస్త్రములను చదువుకొనుట- మాత్సర్యమనఁగా అన్ని ప్రాణులయెడను సహనములేక పోవుట- అది లేకపోవుటఅమాత్సర్యము- హ్రీయనఁగా అకార్యములను చేయుటయందుసిగ్గు- తితిక్షయనఁగా శీతోష్ణాదిద్వంద్వములను సహించుట- అనసూయయనఁగా పరులదోషములను ప్రకటనచేయకపోవుట- యజ్ఞములనఁగా పంచమహాయజ్ఞములు మొదలగునవి- దానమనఁగా బ్రాహ్మణులకు ధనాదులనొసంగుట- ధృతియనఁగా విషయములు సన్నిహితములై యున్నను ఇంద్రియములను నిగ్రహించికొనుట- శమమనఁగా చక్షురాదీంద్రియములను ఇచ్చవచ్చినట్లు పోకుండ పట్టియుంచుట-

యస్త్వేతేభ్యః ప్రవసేత్ ద్వాదశభ్యః
సర్వామిమాం స పృథివీం ప్రశిష్యాత్ ।
త్రిభిర్ద్వాభ్యామేకతో వావిముక్తాః
క్రమాద్విశిష్టా మౌనభూతా భవన్తి ॥౨౧॥

యస్తు ఏతేభ్యః ద్వాదశభ్యః అప్రవసేత్= ఎవ్వఁడు ఈపండ్రెండిటినుండి ప్రవాసము చేయఁడో, సః ఇమాం సర్వాం పృథివీం ప్రశిష్యాత్ = వాఁడు ఈసమస్తమయినభూమిని పలును- త్రిభిః ద్వాభ్యామ్ ఏకతో వా అవిముక్తాః= మూడింటిచేతఁగాని రెండిటిచేతఁగాని ఒకటిచేతఁగాని విడువఁబడనివారు, క్రమాత్ విశిష్టాః మౌనభూతాః భవన్తి = క్రమముగా విశేషించినవారై మౌనులు అగుదురు-

తా॥ఎవ్వఁడు ఈపండ్రెండుగుణములును లేకుండనుండఁడో వాఁడు ఈభూమినంతటిని తనవశమునఁ జేసికొనును- ఈగుణములలో మూడుగాని రెండుగాని ఒకటిగాని కలవారలుగూడ క్రమముగా అతిశయమును పొందినవారై మునులు అగుదురు- మోక్షమునకు తగినవారగుదురనుట.

మానభూతులనఁగా పరబ్రహ్మమె అయినవారు- అనిశంకరభాష్యము-

దమస్త్యాగో ప్రమాదశ్చ ఏతేష్వమృతమాహితమ్।
తానిసత్యముఖాన్యాహుర్బ్రాహ్మణాయేమనీషిణః॥౨౨॥

దమః త్యాగః అప్రమాదశ్చేతి= దమంబును త్యాగంబును అప్రమాదంబుననెడ, ఏతేషు అమృతమ్ ఆహితమ్= వీనియందు మోక్షము ఉంచఁబడియున్నది- యే మనీషిణః బ్రాహ్మణాః= ఎవ్వరు బుద్ధిమంతులగు బ్రాహ్మణులో, తే తాని సత్యముఖాని ఆహుః= వారు వానిని సత్యమునకుముఖములనుగా చెప్పుచున్నారు-

తా॥ దమముఅనఁగా అంతరింద్రియ నిగ్రహము, ఈవి, పొరపాటులేకపోవుట, ఈమూడును క్రమముగా మోక్షమును కలిగించునవి- ఇవి మోక్షమునకు ద్వారములని జ్ఞానులగు బ్రాహ్మణులు చెప్పుదురు-

ఈశ్లోకముశంకరభాష్యమున వ్యాఖ్యానము చేయఁబడలేదు-

దమోష్టాదశదోషస్స్యాత్ ।ప్రాతికూల్యం కృతేభవేత్।
అనృతం పైశునంతృష్ణా ప్రాతికూల్యం తమోరతిః॥౨౩॥
లోకద్వేషోభిమానశ్చ వివాదః ప్రాణిపీడనమ్।
పరివాదోతివాదశ్చ పరితాపో క్షమాధృతిః॥౨౪॥
అసిద్ధిఃపాపకృత్యంచ హింసాచేతిప్రకీర్తితాః।
ఏతైర్దోషైర్విముక్తోయస్సదమస్సద్భిరుచ్యతె॥౨౫॥

దమః అష్టాదశదోషః స్యాత్= దమము పదునెనిమిదిదోషములు కలది అగును- యస్మిన్ కృతే ప్రాతికూల్యం భవేత్= ఏదోషము కలిగినయెడను ప్రాతికూల్యము కలుగునో, అనృతం పైశునం తృష్ణా ప్రాతికూల్యం తమః అరతిః= అసత్యంబును కొండెములుచెప్పుటయును విషయములయందలియాశయును అందఱకుప్రతికూలుడుగానుండుటయునుఅజ్ఞానంబును దొరికినంతమాత్రముతోదృప్తినిజెందకయుండుటయును,లోకద్వేషః అభిమానశ్చ వివాదః ప్రాణిపీడనమ్= లోకులతోద్వేషించుటయును గర్వంబును జనులతోకలహపడుచుండుటయును తనబ్రతుకునకైప్రాణులనుహింసించుచుండుటయును, పరివా

దః అతివాదశ్చ పరితాపః అక్షమా అధృతిః= ముఖము ముందఱనె దూషించుటయును నిరర్థకముగా పెక్కు మాటలాడుచుండుటయును నిరర్థకముగా దుఃఖపడుచుండుటయును శీతోష్ణాదులను ఓర్వలేకపోవుటయును విషయచాపల్యంబును, అసిద్ధిః పాపకృత్యంచ హింసాచేతి= కర్మజ్ఞానవైరాగ్యంబులులేకపోవుటయును పాపములను జేయుటయును ప్రాణులను చంపుటయునని, దోషాః ప్రకీర్తితాః= దోషములు చెప్పఁబడినవి- యః ఏతైః దోషైః విముక్తః= ఏది ఈ దోషములచేత విడువబడినదో, సః సద్భిః దమః ఉచ్యతే= అది సత్పురుషులచేత దమముగా చెప్పఁబడుచున్నది-

తమః రతిః అనియును పదచ్ఛేదము చేయవచ్చును- రతియనఁగా (స్త్రీ) సంభోగము-

తా॥ దమమునకు అనృతభాషణము మొదలుగన పదునెనిమిదియును దోషములు- ఈదోషములతోఁగూడినది దమమే కాదు- ఈ దోషములులేనిదే దమమని పెద్దలు చెప్పిరి-

హింసయనఁగా అశాస్త్రీయముగా హింసచేయుట- అనిశంకరభాష్యము-

మదోష్టాదశ దోషః స్యాత్త్యాగో భవతిషడ్విధః।
విపర్యయాః స్మృతా ఏతే మదదోషా ఉదాహృతాః॥ ౨౬॥

మదః అష్టాదశదోషః స్యాత్= మదము పదునెనిమిదిదోషములుగలది అగును- త్యాగః షడ్విధః భవతి= త్యాగము ఆఱువిధములుగలది అగుచున్నది- విపర్యయాః స్మృతాః ఏతే= వ్యతిరేకములుగా (contraries.) చెప్పంబడిన ఈదమదోషములె, మదదోషాః ఉదాహృతాః= మదమును పోఁగొట్టునవిగా చెప్పఁబడినవి-

తా॥ మదమునకుగూడ పదునెనిమిదిదోషములు కలవు- మదదోషములనఁగా మదమును పోఁగొట్టునవి యనుట- అవియెవ్వియన్నను వెనుకఁ జెప్పఁబడిన దమదోషములయొక్క విపర్యయము (contraries) లయిన ౧ సత్యము ౨ అపైశునము ౩ అతృష్ణ ౪ అప్రాతికూల్యము ౫ అతమస్సు ౬ రతి ౭ లోకాద్వేషము ౮ అనభిమానము ౯ అవివాదము ౧౦ అప్రాణిహింస ౧౧ అపరివాదము ౧౨ అన

తివాదము ౧౩ అపరితాపము ౧౪ శమము ౧౫ ధృతి ౧౬ సిద్ధి ౧౭ అపా పకృత్యము ౧౮ అహింస అనుపదునెనిమిదె. వీనిస్వరూపములు ౨౫ వశ్లోకమువలను చెప్పఁబడిన దమదోషములకు విపరీతములె కా న వేఱుగా నిచ్చట నిరూపింప నక్కఱలేదు. త్యాగంబులాఱును ౨౭ వశ్లోకంబున నిరూపింపఁబడును.

శ్రేయాంస్తు షడ్విధ స్త్యాగ స్తృతీయో దుష్కరో భవేత్।
తేనదుఃఖం తరస్త్యేవ భిన్నం తస్మిన్ జితంకృతే ॥ ౨౭ ॥

షడ్విధః త్యాగః శ్రేయాన్ = ఆఱువిధములుగల త్యాగము శ్రేష్ఠము. తృతీయః దుష్కరః భవేత్ = మూడవది కష్టసాధ్యము అగు ను. తేన దుఃఖం తరస్త్యేవ = దానిచేతను దుఃఖమును దాఁటనేదాఁ టుదురు. తస్మిన్ కృతే భిన్నం జితమ్ = అది ఆచరింపఁబడినదగు చుండఁగా మిగిలినదంతయును జయింపఁబడినదే.

తా ॥ ఆఱుత్యాగములలోనును మూడవదిగాఁ జెప్పఁబడఁబో వు త్యాగము శ్రేష్ఠము. దానిని సంపాదించుటకష్టము. అదితాప త్రయమును పోఁగొట్టును. దానిని స్వాధీనము చేసికొనినవాఁడు అన్నిటిని స్వాధీనము చేసికొనిన వాఁడె.

అర్హతే యాచమానాయ పుత్రాన్వితం దదాతియత్ ।
ఇష్టాపూర్తంద్వితీయంస్యాన్నిత్యంవైరాగ్యయోగతః॥ ౨౮ ॥
కామ స్త్యాగశ్చ రాజేన్ద్ర సతృతీయ ఇతిస్మృతః ।

అర్హతే యాచమానాయ పుత్రాన్వితం దదాతీతియత్ = తగినవా నికిని కోరినవానికిని పుత్రునిసయితము ఇచ్చుటయేదికలదో. (తత్ ప్రథమమ్=అది మొదటిది). ఇష్టాపూర్తం ద్వితీయం స్యాత్ = ఇ ష్టంబునుపూర్తంబును రెండవది అగును. నిత్యం వైరాగ్యయోగతః = నిత్యముగా వైరాగ్యముకలుగుటవలన, యశ్చ కామః త్యాగః స్యాత్ = ఏ కామరూపమైన త్యాగము కలుగునో, హేరాజేన్ద్ర సః తృతీయయితి స్మృతః = ఓరాజశ్రేష్ఠుఁడా అది మూడవదని చె ప్పఁబడినది.

తా ॥ త్యాగములాఱు నెవ్వియన్నను — ౧ తగినవానికి ఆ తఁడు కోరకుండఁగనె ఇచ్చుట ౨ కోరినవానికి ఇచ్చుట ౩ దేవ

తలకై యజ్ఞాది రూపమునకిచ్చుట ౪ కోనేరులు నూతులు మొదలగునవి త్రవ్వించుటకై ధనమునిచ్చుట ౫ ధనాదులయందు వైరాగ్యముకలవాఁడై గృహస్థుఁడైయేయుండుట ౬ సంన్యసించుట.

పూర్తమనఁగా స్మార్తకర్మములయందు ధనమును వ్రయము చేయుట- పైతృకకార్యములయందు వ్యయముచేయుటయని కొందఱు చెప్పిరి- అనిశంకరభాష్యము

నీలకంఠీయ భారత వ్యాఖ్యానమున ఇష్టము అపూర్తము ౹ నిపదచ్ఛేదము చేయఁబడి, అపూర్తమనఁగా కోనేరులు త్రవ్వించుట తోటలు వేయించుట మొదలగునదియని చెప్పఁబడినది-

అప్రమాదీ భవేదేతైః స చాప్యష్టగుణో మహాన్ ॥౨౯॥
సత్యం ధ్యానం సమాధానం చోద్యం వైరాగ్యమేవచ ।
అస్తేయం బ్రహ్మచర్యంచ తథాఽసంగ్రహమేవచ ॥౩౦॥

ఏతైః అప్రమాదీ భవేత్=వీనిచేతను అప్రమాదముకలవాఁడుఅగును, సచాపి అష్టగుణః మహాన్ భవేత్= అదియును ఎనిమిదిగుణములుకలదై గొప్పదిఅగును-(ఆయెనిమిదిగుణములెవ్వియన్నను) సత్యం ధ్యానం సమాధానమ్= సత్యంబును ధ్యానంబును సమాధియును, చోద్యం వైరాగ్యమేవచ=ప్రశ్నములుచేసికొనుటయును వైరాగ్యంబును, అస్తేయంబ్రహ్మచర్యంచ= దొంగతనములేకపోవుటయును బ్రహ్మచర్యంబును-తథా అసంగ్రహమేవచ= అట్లె పట్టుదలలేకపోవుటయును-

సత్యమనఁగా యథార్థమును చెప్పుట- ధ్యానమనఁగా షండలపురుషుఁడు మొదలగుధ్యేయవస్తువును నూనె ధారవలె ఎడతెఱపిలేకుండ తలంచుచుండుట- సమాధానమనఁగా ప్రణవముతో విశ్వాదుల యుపసంహారమును చేసి స్వభావసిద్ధమైన సచ్చిదానందాద్వితీయబ్రహ్మముగా నుండుట-చోద్యమనఁగా నేనెవ్వఁడను ఎవ్వనివాఁడను ఎచ్చటినుండివచ్చితిని అనియిట్లుప్రశ్నములుచేసికొనుట- వైరాగ్యమనఁగా ఐహలౌకిక పారలౌకిక విషయములు రెండిటియందును ఆశలేకపోవుట- అస్తేయమనఁగా దొంగతనములేకపోవుట- యో న్యథాసన్తమాత్మానమ్(౭అ॥౩౭శ్లో) అని చెప్పఁబడిన చొప్పున నాత్మాపహారముగూడ దొంగతనమేకాన నదిలేకపోవుటగూడ నిచ్చట

నభిప్రేతము- బ్రహ్మచర్యమనఁగా మైథునాంగము లెనిమిదింటిలో నె
ద్దియైనను లేకపోవుట- ఎనిమిదియంగము లెవ్వియన్నను— శ్లో॥
దర్శనం స్పర్శనం కేలిః కీర్తనం గుహ్యభాషణమ్ । సంకల్పోఽ-
ధ్యవసాయశ్చ క్రియానిర్వృత్తి రేవచ । ఏతన్మైథున మష్టాఙ్గం
ప్రవదంతి మనీషిణః॥ దీనియర్థము- అపేక్షతోఁ జూచుటయును ము
ట్టుటయును ఆటలాడుటయును పొగడుటయును రహస్యముగా మాట
లాడుటయును సంభోగింపఁగోరుటయును సంభోగింపనిశ్చయించు
టయును సంభోగమును జరిగించుటయునను నెనిమిదియును మైథున
మునకు ఎనిమిది అంగములుగా పెద్దలు చెప్పుచున్నారు- అసంగ్రహ
మనఁగా కొడుకులు పెండ్లాము భూములు ఇల్లు మొదలగువానియం
దు వేనియందును అభిమానము లేకపోవుట- అనిశంకరభాష్యము-

ఏవందోషాదమస్యోక్తాస్తాన్ దోషాన్ పరివర్జయేత్ ।
దోషత్యాగేఽప్రమాదః స్యాత్స చాప్యష్టగుణో మతః ॥౩౧॥

ఏవం దమస్య దోషాః ఉక్తాః= ఇట్లు దమముయొక్క దోషములు
చెప్పఁబడినవి- తాన్ దోషాన్ పరివర్జయేత్= ఆ దోషములను వి
డువవలయును- దోషత్యాగే(సతి) అప్రమాదః స్యాత్= దోష
ములనువిడుచుటకలుగుచుండఁగా అప్రమాదము కలుగును- స చాపి
అష్టగుణః మతః= అదిగూడ ఎనిమిదిగుణములుగలదిగా అంగీకరిం
పఁబడినది-

తా॥ ఇట్లు దమముయొక్క దోషములు చెప్పఁబడినవి. ఈ
దోషములను విడుచుటయె త్యాగము- అదికలిగినతోడనె అప్రమా
దముకలుగును- అప్రమాదమునకు సత్యము ధ్యానము మొదలగునవి
యెనిమిదియును గుణములు-

సత్యాత్మాభవ రాజేంద్ర సత్యే లోకాః ప్రతిష్ఠితాః ।
తాంస్తు సత్యముఖానాహుస్సత్యే హ్యమృతమాహితమ్ ॥౩౨॥

హేరాజేంద్ర! సత్యాత్మా భవ= ఓరాజశ్రేష్ఠుఁడా సత్యమునసం
తఃకరణముకలవాఁడవు అగుము- లోకాః సత్యే ప్రతిష్ఠితాః= లో
కములు సత్యములో ఉన్నవి- తాన్ సత్యముఖాన్ ఆహుః= ఆలో
కములను సత్యమే ద్వారముగాఁగలవానిగా చెప్పుచున్నారు- అమృ

తమ్ సత్యే ఆహితంహి= మోక్షము సత్యమునందె ఉన్నఁబడినదిగ దా.

తా॥ ఓధృతరాష్ట్రుఁడా నీవు సత్యమున మనస్సును ఉంచుము- సత్యమువలన మంచిలోకములు కలుగును- మోక్షముగూడ సత్యమువలననె కలుగును-

సత్యాత్మా= సత్యస్వరూపుఁడవు- అనిశంకరభాష్యము-

నివృత్తేనైవదోషేణతపోవ్రతమిహాచరేత్ ।

ఏతద్ధాత్రాకృతంవృత్తంసత్యమేవసతాంపరమ్ ॥౩౩॥

దోషేణ నివృత్తేనైవ(సతా)=దోషము నివర్తించినదగుచుండగనే, ఇహ తపోవ్రతమ్ ఆచరేత్=ఇచ్చట తపస్సనెడివ్రతమును ఆచరింపవలయును- ఏతత్ సత్యమేవ= ఈ సత్యమే, ధాత్రా కృతం సతాం పరం వృత్తమ్=పరమేశ్వరునిచేత ఏర్పఱుపఁబడిన సత్పురుషుల గొప్ప ఆచారము-

తా॥ దోషములేవియు లేకుండునట్లు తపస్సును ఆచరింపవలయును- సత్పురుషులకు సత్యమె గొప్పతపస్సు అని పరమేశ్వరునిచేత ఏర్పఱుపఁబడినది-

దోషైరేతైర్విముక్తంయత్ గుణైరేతైస్సమన్వితమ్ ।

ఏతత్సమృద్ధమప్యృద్ధంతపోభవతికేవలమ్ ॥౩౪॥

యత్= ఏది, ఏతైః దోషైః విముక్తమ్=ఈ దోషములచేత విడువఁబడినదియును, ఏతైః గుణైః సమన్వితంచ భవతి=ఈగుణములతోఁగూడినదియును అగుచున్నదో, ఏతత్ తపః= ఈ తపస్సు, సమృద్ధమ్ ఋద్ధమ్ కేవలమపి భవతి= సమృద్ధంబును ఋద్ధంబును కేవలంబును అగును.

తా॥ వెనుక సమృద్ధంబును ఋద్ధంబును కేవలంబునని చెప్పఁబడినతపస్సు, క్రోధాదిదోషంబులులేనిదియును జ్ఞానాదిగుణములతోఁ గూడినదియునై యుండవలయును-

యన్మాంపృచ్ఛసిరాజేంద్రసంక్షేపాత్ప్రబ్రవీమి తే ।

ఏతత్పాపహరంశుద్ధంజన్మమృత్యుజరాపహామ్ ॥౩౫॥

హేరాజేంద్ర= ఓరాజశ్రేష్ఠుఁడా, మాం యత్ పృచ్ఛసి= నన్ను

దేనిని అడుగుచున్నావో, తత్ సంక్షేపాత్ తే ప్రబ్రవీమి= దానిని సంక్షేపముగా నీకు చెప్పుచున్నాను- ఏతత్ పాపహరం శుద్ధమ్ జన్మమృత్యుజరాపహంచ (భవతి) = ఇది పాపములను పోఁగొట్టునదియును పరిశుద్ధమైనదియును పుట్టుకయును మృత్యువునును ముదిమినిని పోఁగొట్టునదియును అగుచున్నది-

తా॥ ఓ ధృతరాష్ట్రుఁడా నీవు అడిగినదానిని ఇఁక సంగ్రహముగా చెప్పెదను- నేను చెప్పఁబోవునది పాపములనన్నిటిని పోగొట్టును- పరిశుద్ధమైనది- జన్మము మృత్యువు ముదిమి అనెడి సంసారములోఁగలిగెడి బాధలను పోఁగొట్టును.

ఇంద్రియేభ్యశ్చ పంచభ్యో మనసశ్చైవ భారత ।
అతీతానాగతేభ్యశ్చ ముక్తశ్చేత్స సుఖీ భవేత్ ॥౩౬॥

హే భారత= ఓ భరతవంశమువాఁడా!, పంచభ్యః ఇంద్రియేభ్యః= అయిదు ఇంద్రియములనుండియును, మనసః అతీతానాగతేభ్యశ్చ ముక్తశ్చేత్ = మనస్సునుండియు గతించినవానినుండియు రాఁబోవు వానినుండియు మఱలిన యెడను, సః సుఖీ భవేత్= వాఁడు సుఖవంతుఁడు అగును-

తా॥ విషయములయందు ప్రవర్తింపుచుండెడి యింద్రియములును మనస్సును లేనివాఁడును గడచినవానినిని రాబోవువానినిని సరకుసేయనివాఁడును సుఖవంతుఁడగును-

ధృతరాష్ట్ర ఉవాచ= ధృతరాష్ట్రుఁడు పలికెను-

ఆఖ్యానపంచమైర్వేదైర్భూయిష్ఠం కథ్యతే జనః ।
తథాచాన్యే చతుర్వేదాస్త్రివేదాశ్చ తథాపరే ॥౩౭॥
ద్వివేదాశ్చైకవేదాశ్చాప్యన్యతశ్చ తథాపరే ।
ఏతేషు మేధికం బ్రూహి యమహం వేద బ్రాహ్మణం ॥౩౮॥

(కశ్చిత్) జనః ఆఖ్యానపంచమైః వేదైః భూయిష్ఠం కథ్యతే= (ఒకానొక) జనుఁడు ఇతిహాసములు అయిదవదిగాఁగల వేదములచేత మిక్కిలిగా శ్లాఘింపఁబడుచున్నాఁడు- తథాచ అన్యే చతుర్వేదాః= అట్లే మిగిలినవారు నాలుగువేదములు కలవారు- తథా అపరే త్రివేదాః= అట్లే మఱికొందఱు మూఁడు వేదములు కలవారు-

ద్వివేదాశ్చ ఏకవేదాశ్చాపి (సంతి)= రెండు వేదములుగలవారును ఒక్క వేదముకలవారును (కలరు-) తథా అపరే (వేదేభ్యః) అన్యతశ్చ (సన్తి)= అట్లే మఱికొందఱు (వేదములకు, వెలుపల (కలరు)- ఏతేషు అధికం మే బ్రూహి= వీనిలో అధికుని నాకు చెప్పుము- యం బ్రాహ్మణమ్ అహమ్ వేద= ఎవ్వని బ్రాహ్మణునిగా నేను తెలిసికొందునో-

తా॥ పురాణములతోఁగూడ నాలుగు వేదములను జదివికొన్నవాఁడు పంచవేదియని చెప్పఁబడును- నాలుగు వేదములను మాత్రమె చదివికొన్నవాఁడు చతుర్వేదియనఁబడును- ఇట్లు మూఁడు వేదములను చదివికొన్నవాఁడు త్రివేదియనియును, రెండు వేదములను చదివికొన్నవాఁడు ద్వివేదియనియును, ఒక్క వేదమును చదివికొన్నవాఁడు ఏకవేదియనియును చెప్పఁబడును- వీరుగాక వేదమన్నదియె యెఱుంగనివారు కూడ గలరు- వీరిలో బ్రహ్మజ్ఞానియనునర్థముగల బ్రాహ్మణశబ్దముచేతఁ జెప్పఁబడఁదగినవాఁడు ఎవ్వఁడు?

సనత్సుజాత ఉవాచ= సనత్సుజాతుఁడు పలికెను-

ఏకస్య వేద్యస్యాజ్ఞానాద్వేదాస్తే బహవోఽభవన్ ।
సత్యస్యైకస్య రాజేంద్ర సత్యే కశ్చిదవస్థితః ॥౩౯॥

(హే రాజేంద్ర= ఓ రాజశ్రేష్ఠుఁడా) వేద్యస్య ఏకస్య అజ్ఞానాత్= తెలియవలసినది ఒక్కటి తెలియకపోవుటవలన, తే వేదాః బహవః అభవన్= ఆ వేదములు అనేకములు అయినవి- ఏకస్య సత్యస్య (అజ్ఞానాదేవ)= ఒక్క సత్యము (తెలియకపోవుట వల్లనె,) కశ్చిత్ సత్యే అవస్థితః (భవతి)= ఒకానొకఁడు సత్యమున నున్నవాఁడు (అగును-)

తా॥ తెలియవలసినది సత్యమని చెప్పఁబడియెడి పరబ్రహ్మమొకటియె- అది ఇట్టిదని తెలియఁబడకపోవుటచేత వేదములు అనేకములయినవి- ఒకానొకఁడు ఈలోకమున ఆసత్యమును తెలిసికొని బ్రహ్మనిష్ఠుఁడగును-

ఏకస్య వేదస్య అని శంకరభాష్యపాఠము- వేదమనఁగా తె

లివి- అనఁగా జ్ఞానస్వరూపమయిన ఒక్క పరబ్రహ్మమును తెలియక పోవుటవలన అనియర్థము-

వేదశబ్దము విద్ అనుధాతువునఁగలిగినది- విద్ అనుధాతువునకు నాలుగు అర్థములు కలవు- అవియెవ్వియన్నను ౧ విచారించుట- ౨ సత్త అనఁగా ఉనికి- ౩ తెలిసికొనుట- ౪ పొందుట- కాగా- పరబ్రహ్మమును గూర్చిన విచారమును చేయునవియనియును, పరబ్రహ్మముయొక్క ఉనికిని సాధించునవి యనియును, పరబ్రహ్మమును తెలిసికొనుటకు సాధనములగునవియనియును, పరబ్రహ్మమును పొందినవియనియును వేదశబ్దమునకు నాలుగు అవయవార్థములు శంకరభాష్యమున వ్రాయఁబడినవి-

ఏవం వేదమవిజ్ఞాయ ప్రాజ్ఞోహమితిమన్యతే ।
దానమధ్యయనం యజ్ఞో లోభాదేతత్ప్రవర్తతే ॥౪౦॥

ఏవం వేదమ్ అవిజ్ఞాయ= ఇట్లు వేదమును తెలిసికొనకయె, అహం ప్రాజ్ఞః ఇతి మన్యతే= నేను ప్రాజ్ఞుఁడను అని తలఁచుచున్నాఁడు- దానమ్ అధ్యయనం యజ్ఞః ఇత్యేతత్ లోభాత్ ప్రవర్తతే= దానంబును అధ్యయనంబును యజ్ఞంబును అనునది లోభమువలన ప్రవర్తించుచున్నది-

తా॥ ఇట్లు పరబ్రహ్మప్రతిపాదకము వేదమనియెఱుఁగనివాఁడుకూడ ఆర్త్విజ్యములు మొదలగునవి చేసి ధనమును సంపాదించికొనుటకై వేదమును చదివికొని తానును వేదజ్ఞుఁడే అనుకొనుచున్నాఁడు- ఇచ్చట దానమనఁగా వేదమును ఒక్కనికి చెప్పుట- అధ్యయనమనఁగా వేదమును చదివికొనుట- యజ్ఞమనఁగా జ్యోతిష్టోమము మొదలగునది-

ఈశ్లోకము శంకరభాష్యమున వ్యాఖ్యానము చేయఁబడలేదు-

సత్యాత్ప్రచ్యవమానానాం సంకల్పావితథాభవన్ ।
తతఃకర్మప్రతాయేత సత్యస్యానవధారణాత్ ॥౪౧॥

సత్యాత్ ప్రచ్యవమానానాం సంకల్పాః= సత్యమునుండి జారుచున్నవారి సంకల్పములు, వితథాః అభవన్= వ్యర్థములు అయినవి- సత్యస్య అనవధారణాత్= సత్యమును తెలియకపోవుటవలన, తతః కర్మ ప్రతాయేత= అటుపైని కర్మము విస్తరింపఁబడును-

వితథా ఆభవత్ అని యుండవలసినదానికి వితథాభవన్ అనియుండుట ఆర్షము.

తా॥ సత్యమనెడి బ్రహ్మము నెఱుంగని వారికోరికలు వ్యర్థములగును. అటపైని ఆకోరినవిస్సిద్ధించుటకు యజ్ఞాదికర్మములయందు ప్రవర్తింతురు. ఇదియంతయును బ్రహ్మజ్ఞానము లేకపోవుటను కలిగినదియె.

పరబ్రహ్మజ్ఞానము లేకపోవుటనే సంసారముకలిగినదిగాన, పరబ్రహ్మమెట్టానని యెంతవఱకు నెఱుఁగఁడో, అంతవఱకును మొసళ్లుపట్టియీడ్చినయట్లు రాగము మొదలగునవి తన్నుయీడ్వగా ఇటు అటు తిరుగుచున్నవాఁడై తనకోరికలు ఈడేరకపోవుటను స్వర్గము ఐశ్వర్యము మొదలగునవి కలిగెడి సాధనములయందు ప్రవర్తింపుచుండును. అనిశంకరభాష్యము.

విద్యాద్బహుపఠంతంతుబహువాగితిబ్రాహ్మణమ్ ।
సఏవసత్యాన్నాపైతిసజ్ఞేయోబ్రాహ్మణస్త్వయా ॥౪౨॥

బహు పఠంతం బ్రాహ్మణమ్= విస్తారము చదువుచున్న బ్రాహ్మణుని, బహువాగితి విద్యాత్= చాలచదువుకలవాఁడని తెలిసికొనవలయును. సఏవ సత్యాత్ నాపైతి చేత్ = ఆతఁడె పరమేశ్వరునకు తప్పకుండెనా, సః త్వయా బ్రాహ్మణఇతి జ్ఞేయః= వాఁడు నీచేత బ్రాహ్మణుఁడని తెలియఁబడఁదగినవాఁడు.

తా॥ నీవు వెనుకఁజెప్పిన పంచవేదియైనను చాలచదువుకున్నవాఁడనఁదగినవాఁడెకాని బ్రహ్మజ్ఞానము కలవాఁడను యర్థమిచ్చెడు బ్రాహ్మణశబ్దముచేతఁ జెప్పఁదగినవాఁడుకాఁడు. వానికైనను బ్రహ్మజ్ఞానముగూడ కలిగియుండెనేని వానిని బ్రాహ్మణుండన వచ్చును.

ఛందాంసినామద్విపదాంవరిష్ఠ
స్వచ్ఛందయోగేనభవంతితత్ర ।
ఛందోవిదస్తేనచతానధీత్య
గతాహివేదస్యనవేద్యమార్యాః ॥౪౩॥

హే ద్విపదాం వరిష్ఠ = ఓ మనుష్యులలో శ్రేష్ఠుఁడయినవాఁ

దా. ఛన్దాంసి స్వచ్ఛన్దయోగేన తత్ర భవన్తి నామ— వేదములు యథేష్టముగా ఆపరబ్రహ్మము విషయముననే ప్రవర్తించుచున్నవిగదా. తేనచ= ఆహేతువుచేతను, ఆర్యాః ఛన్దోవిదః= పెద్దలైన వేదజ్ఞులు, తాన్ అధీత్య వేదస్య గతాంహి= వానిని చదువుకొని వేదమును పొందిరిగదా. వేద్యం నగతాంహి= వేదములచేతఁ దెలియఁజేయఁబడెడి పరబ్రహ్మము పొందకున్నారుగదా.

తా॥ వేదములు ముఖ్యముగా పరబ్రహ్మమును తెలియఁజేయునవియె. కాఁబట్టి పంచవేదులు మొదలగువారు వేదములమాత్రము చదివికొనినవారై. ఆవేదవేద్యుఁడగు పరమపురుషుని తెలిసికొనుట లేదు.

శంకరభాష్యమున, ఆర్యాః తాన్ అధీత్య వేదస్య స్వరూపం గతాంహి= పెద్దలు ఆవేదమును చదివికొని జ్ఞానస్వరూపుఁడగు పరబ్రహ్మముయొక్క స్వరూపమును పొందిరిగదా. వేద్యం నగతాంహి తెలియఁబడునదియగు ప్రపంచమును పొందకుండిరిగదా. అనియోజన చేయఁబడినది.

న వేదానాం వేదితా కశ్చిదస్తి
వేద్యేన వేదం నవిదుర్నవేద్యమ్।
యో వేద వేదం సచ వేదవేద్యం
యో వేదవేద్యం న స వేద సత్యమ్॥ ౨౨॥

వేదానాం (మధ్యే తస్య) వేదితా (వేదః) కశ్చిత్ నాస్తి= వేదముల (లోపల అతని) తెలిసికొనెడి (వేదము) ఒక్కటైనను లేదు. వేద్యేన సహ వేదం నవిదుః= తెలియఁదగిన పరమపురుషునితోఁగూడ వేదమును ఎఱుఁగరు, (యస్మాత్) వేద్యం నవిదుః= ఎందువలన వేదములచేతఁ దెలియఁబడెడి పరమేశ్వరుని ఎఱుఁగరో, యః వేదం వేద= ఎవ్వఁడు వేదమును ఎఱుఁగునో, సచ వేద్యం వేద= వాఁడు వేద్యుఁడైన పరమేశ్వరుని ఎఱిఁగినవాఁడు. యః వేద్యం వేద= ఎవ్వఁడు పరమేశ్వరుని ఎఱుఁగునో, సః సత్యం నవేద= వాఁడు పరమేశ్వరుని ఎఱుఁగఁడు.

తా॥ వేదములుగూడ పరమేశ్వరుని స్వరూపమునంతయు తె

లియఁజేయఁజాలవు- కాఁబట్టి పరమపురుషుని స్వరూపముతోఁ
గూడ నేనువేదమును లెస్సగా నెఱుంగుదును అనఁదగినవాఁడు ఎ
వ్వఁడును లేఁడు- అందుకు హేతువేమనినను ఆపరమపురుషుని ఎవ్వఁ
డును తెలిసికొనలేక పోవుటయె- అయితే యస్యామతం తస్యమ
తమ్ (కే నో॥ ౨॥ 3) అను వేదవాక్యమును ఎవ్వఁడెఱుఁగునో, వాఁడె
పరమపురుషుని నెఱిఁగినవాఁడు- ఇట్లుకాక పరమపురుషస్వరూప
మును నేనెఱుంగుదునని ఎవ్వఁడనుకొనునో వాఁడు ఆసత్యస్వరూ
పుఁడైన పరమపురుషుని ఏమియు నెఱుఁగనివాఁడె. ఎవ్వఁడుపరమ
పురుషస్వరూపము మనము తెలిసికొనదగనిదనుకొనునో వాఁడె ప
రమపురుష స్వరూపము నెఱిఁగినవాఁడు- ఎవ్వఁడు తెలిసికొంటిన
నుకొనునో వాఁడేమియు నెఱుఁగనివాఁడని ఆశ్రుతికర్థము-

ఇచ్చట శంకరభాష్యయోజన యెట్లన్నను- వేదానాం మధ్యే
ఽపి వేదః వేదితా నాస్తి= వేదములలోపల ఒక్కటియైనను వే
= పరబ్రహ్మమును తెలిసికొనునది లేదు- వేద్యేన వేదం న విదుః=
యఁబడుదానిచేత తెలిపిని తెలిసికొనరు- వేద్యమపి న వి
దుః= తెలియఁబడుదానిగూడ నెఱుఁగరు -యః వేదం వేద= ఎవ్వఁడు
జ్ఞానస్వరూపుఁడైన పరబ్రహ్మమును తెలిసికొనునో, సః వేద్యం
వేద= వాఁడు తెలియఁబడుదానిని తెలిసికొనును- యః వేద్యం
వేద= ఎవ్వఁడు తెలియఁబడుదానిని తెలిసికొనునో, సః సత్యం న
వేద= అతఁడు సత్యమైన పరబ్రహ్మము నెఱుఁగఁడు-

తా॥ ఋగ్వేదాదులలోనొక్క వేదమైనను వాఙ్మనములకుగో
చరుఁడుకానివాఁడును సంవిద్రూపుఁడునగు పరమాత్మను తెలియఁజే
యునది కాదు- ఏమన్నను- తెలియఁబడునదియైన జడస్వరూపము
చేతను జ్ఞానస్వరూపమైన పరబ్రహ్మమును తెలిసికొనఁజాలరు-
ఈప్రపంచమును గూడ నెఱుఁగరు- జ్ఞానమునుపట్టి కదా అన్నియును
తెలియఁబడుట- కావున సంవిత్స్వరూపమగు పరమాత్మను ఎవ్వఁడెఱుఁ
గునో వాఁడె ప్రపంచము నెఱిఁగినవాఁడు- వేద్యమగు ప్రపంచము నె
ఱుఁగు వాఁడు సత్యము నెఱుఁగువాఁడు కాఁడు-

శ్లో॥ వేదవేదాన్ సచ వేదవేద్యం

నతంవిదుర్వేదవిదో నవేదాః।
తథాఽపివేదేనవిదంతివేదం
యేబ్రాహ్మణావేదవిదోభవంతి॥౬౫॥

యః వేదాన్ వేద= ఎవఁడు వేదవాక్యములను ఎఱుఁగునో, సః వేద్యంచవేద= వాఁడు తెలియఁబడఁదగిన పరమాత్మను గూడ ఎఱుఁగును- వేదవిదః తం (స్వయం)నవిదుః= వేదవేత్తలు ఆపరమేశ్వరుని(స్వయముగాను)ఎఱుగరు- వేదాః తం నవిదుః=వేదములు ఆపరమేశ్వరుని ఎఱుఁగవు- తథాపి= అయినప్పటికిని,యే బ్రాహ్మణాః వేదెన వేదం విదన్తి= ఏ బ్రాహ్మణులు వేదముచేతను వేదప్రతిపాద్యుని తెలిసికొనుచున్నారో, తే వేదవిదః భవన్తి= వారు వేదవిత్తులు అగుచున్నారు-

తా॥ వెనుకటి శ్లోకమునఁ జెప్పఁబడిన యస్యామత మిత్యాది వేదవాక్యముల నెఱిఁగినవాఁడెవ్వఁడో వాఁడె పరమేశ్వరుని నెఱిఁగినవాఁడు- అంతకంటె మఱియొక్క విధముగా నెఱుఁగుటకు వేదజ్ఞులకు శక్యముకాదు- ఎందువల్లనన్నను వేదములె అంతకంటె విశేషముగా నాయనను ఎఱుఁగఁజాలవు- కాఁబట్టి ఇట్టి వేదవాక్యములలోఁ జెప్పినరీతిని ఆపరమపురుషుని నెఱిఁగి వేదమును జదివికొనినవాడె బ్రహ్మజ్ఞానియని యర్థము నిచ్చెడి వేదవాక్యము చేతఁ జెప్పఁబడఁదగినవారు-

వేదములను చదివికొనినవాఁడు తెలియఁబడెడి దాని నెఱిఁగినవాఁడె కాని ఆత్మజ్ఞుఁడు కాఁడు- వాక్కులకు గోచరుఁడు కాని ఆపరమాత్మను వేదముల నెఱిఁగినవారు తెలిసికొనఁజాలరు- వేదములు గూడ తెలిసికొనఁజాలవు- అయినను వేదముచేతనే జ్ఞానస్వరూపుఁడగు ఆపరమాత్మను తెలిసికొనవలయును- దానిప్రకారము పైశ్లోకమునఁ జెప్పఁబడును- అని శంకరభాష్యము.

థామాంశభాగస్యతథాహివేదా
యథాహిశాఖాచమహీరుహాస్య।
సంవేదనేచైవమథామనన్తి
తస్మిన్ హినిత్యేపరమాత్మనోఽర్థే ॥౬౬॥

తథాహి= అదియుక్తమేకదా- ధామాంశభాగస్య సంవేశనేవ
వీరుహస్య శాఖా యథా= నెలపొడుపును తెలిసికొనుటలో చె
ట్టుయొక్క కొమ్మ ఎట్లు (ఉపయోగించునో), అథ నిత్యే పరమా
త్మనోర్థే- తస్మిన్ సంవేశనేచ వేదాః ఏవమ్= ఇఁకను నిత్యమై
పరమాత్మకొఱకైన ఆజ్ఞానమునందు వేదములు ఇట్లె (ఉపయోగిం
చును), ఇతి ఆమనన్తి= అని చెప్పుచున్నారు-

తా॥ సన్నముగానుండుటచేత నిపుణదృష్టికిగాని తెలియని
నెలపొడుపును చూచినవాఁడు మఱియొక్కనికి చూపునప్పుడు ఆ
చెట్టుకొమ్మవైపు నెలపొడుపున్నదని చెప్పినతోడనె ఆజాడను వాఁ
డుగూడ తెలిసికొనును- ఇట్లు నెలపొడుపు జాడకట్టుటకు ఈచె
ట్టుకొమ్మ ఎట్లు ఉపయోగించునో అట్లు భగవంతుని జాడకట్టుటకు
వేదవాక్యములుపయోగించును-

అభిజానామిబ్రాహ్మణమాఖ్యాతారంవిచక్షణమ్ ।
ఏవంయోహివిజానాతిసజానాతిపరంహితత్ ॥౯౭॥

ఆఖ్యాతారం విచక్షణం= ఇట్లుపరబ్రహ్మమును చెప్పెడి పండితుని,
బ్రాహ్మణమ్ అభిజానామి= బ్రాహ్మణునిగా తెలిసికొనుచున్నా
ను- ఏవంహి యః విజానాతి= ఇట్లు ఎవ్వఁడు తెలిసికొనునో,
సః తత్ పరం జానాతిహి= వాఁడు ఆపరబ్రహ్మమును తెలిసికొ
నునుగదా-

తా॥ ఇట్లు వేదవాక్యములజాడను పరబ్రహ్మము నెఱిఁగిన
వాఁడె బ్రాహ్మణుఁడు-

నాస్యపర్యేషణంగచ్ఛేత్ప్రత్యర్థిషుకథంచన ।
అవిచిన్వన్నిమంవేదేతతఃపశ్యతితంప్రభుమ్ ॥౯౮॥

అస్య పర్యేషణం= ఈబ్రాహ్మణునియొక్క వెదకుట, కథంచన ప్ర
త్యర్థిషు నగచ్ఛేత్= ఎట్లయినను విరుద్ధములయందు పోఁగూడదు-
ఇమమ్ అవిచిన్వన్= దీనిని పోగుచేయకున్నవాఁడు, తతః వేదె
తం ప్రభుం పశ్యతి= ఆటపైని వేదమున ఆప్రభువును చూచును-

తా॥ ఈబ్రాహ్మణుఁడు విషయములయందు దృష్టిని ఉంచ
గూడదు- అట్లువిషయవ్యాసంగములేక వేదవ్యాసంగమునునున్నయె

15-2-1896.

డను పరబ్రహ్మజ్ఞానముకలుగును-

ఈ శ్లోకమునకు శంకరభాష్యమున మఱియొకవిధము గాఁగూడ యోజన చేయఁబడినది- అదియెట్లన్నను-

ఈయాత్మను వెదకుటను ఆత్మవిరోధులగు దేహము ఇంద్రియములు మొదలగువానిలోఁ జేయఁగూడదు- అనఁగా దేహాదులను ఆత్మగాఁ దలంపఁగూడదనుట- ఇట్లు దేహాదులను ఆత్మలోఁ జేర్చి ప్రోగు చేయకుండువాఁడు, వీనికిసాక్షిగా ఆత్మయుండునని తెలిసికొని తత్త్వమసి ఇత్యాది వాక్యములచేత తానె పరమాత్మయని తెలిసికొనును-

తూష్ణీంభూత ఉపాసీత న చేష్టేన్మనసాపిచ ।
ఉపావర్తస్వ తద్బ్రహ్మ హ్యన్తరాత్మని వై శ్రుతమ్ ॥౧౯॥

తూష్ణీంభూత(స్సన్) ఉపాసీత= ఊరకున్నవాఁడై ఉపాసనను చేయునది- మనసాపిచ నచేష్టేత్=మనస్సుచేతనైనను పనిచేయఁగూడదు- తత్ బ్రహ్మ ఉపావర్తస్వ= ఆబ్రహ్మమునుగూర్చి మఱలుము తత్ అంతరాత్మని శ్రుతం వై=అది నీయాత్మలోనె చెప్పఁబడియున్నది-

తా॥ బాహ్యేంద్రియములచేతఁగాని మనస్సుచేతఁగాని ఏమియును పనిని చేయకుండవలయును-ఇట్లు మౌనమును పొందినవాఁడై ఆపరబ్రహ్మమువైపునకు మఱలుము- ఆబ్రహ్మమునకైమన మెచ్చటికిని పోనక్కఱలేదు- నీయాత్మలోనె ఆబ్రహ్మమున్నది-

అద్వైతమతంబున అంతరాత్మయును (జీవుఁడును) పరబ్రహ్మంబును (ఈశ్వరుఁడును) ఒకటియైకాన ఇచ్చట అంతరాత్మని అను శబ్దము హృదయాకాశమునందు అని చెప్పునని శంకరభాష్యమున వ్రాయఁబడినది-

తూష్ణీంభూత ఉపాసీత న చేచ్ఛేన్మనసాపిచ ।
అభ్యావర్తేత బ్రహ్మాస్మై బహ్వనంతరమాప్నుయాత్ ॥౨౦॥

తూష్ణీంభూతః ఉపాసీత= ఊరకున్నవాఁడై ఉపాసనను చేయునది- మనసాపిచ నేచ్ఛేత్=మనస్సుతోనైనను కోరఁగూడదు- అస్మై బ్రహ్మ అభ్యావర్తేత= ఈతనికి బ్రహ్మము అభిముఖముగును- అనం

తరం ఖలు ఆప్నుయాత్= ఆవెంటనె విస్తారమైనలాభమును పొందును-

తా॥ ఊరకొండవలయును- మనస్సునకోరిక కూడనుండఁగూడదు- ఇట్లున్నవానికి బ్రహ్మము అభిముఖమగును- అటువయిన విస్తారము లాభముకలుగును-

మౌనాన్మునిస్స భవతినారణ్యేవసనాన్మునిః ।
అక్షరంతంచయోవేదసమునిశ్రేష్ఠ ఉచ్యతే ॥౫౧॥

సః మౌనాత్ మునిః భవతి=అతఁడు మౌనమువలన ముని అగుచున్నాడు- అరణ్యే వసనాత్ మునిః నభవతి= అరణ్యమున నుండుట వలన ముని కాఁడు- తమ్ అక్షరంచ యః వేద= ఆ అక్షరమును కూడ ఎవ్వఁడు ఎఱుఁగునో, సః మునిశ్రేష్ఠః ఉచ్యతే= వాఁడు మునిశ్రేష్ఠుఁడుగా చెప్పఁబడుచున్నాఁడు-

తా॥ ఇట్లు విషయములయెడను మనస్సునైనను పోనీనివాఁడు మునియగును- అరణ్యమునవివసించుటమాత్రమున మునికాఁడు- ఇట్లు విషయపరాఙ్ముఖుఁడై పరబ్రహ్మనుగ్రహంబున ఆపరబ్రహ్మమును గూడ తెలిసికొనినవాఁడు మునిశ్రేష్ఠుఁడని చెప్పఁబడును-

సర్వార్థానాంవ్యాకరణాద్వైయాకరణఉచ్యతే ।
తన్మూలతోవ్యాకరణంవ్యాకరోతీతితత్తథా ॥౫౨॥

సర్వార్థానాం వ్యాకరణాత్ వైయాకరణః ఉచ్యతే= అన్నిపదార్థములను విమర్శించుటవలన వైయాకరణుఁడుగా చెప్పఁబడుచున్నాఁడు- వ్యాకరణమ్ తన్మూలతః (భవతి)=వ్యాకరణము ఆయక్షరమూలకముగాను (అగుచున్నది)- వ్యాకరోతీతి తత్ తథా (ఉచ్యతే)= శబ్దములను విమర్శించుచున్నదిగాన అది అట్లు(చెప్పఁబడుచున్నదీ-)-

తా॥ సమస్తపదార్థములను విమర్శించి ఇదిసార్థకము ఇదినిరర్థకము అని ఈమునిశ్రేష్ఠుఁడు విమర్శించునుగాన వీనిని వైయాకరుణుఁడనిగూడ చెప్పుదురు- అక్షరములను పట్టిగదా వ్యాకరణముండును- శబ్దములనువిమర్శించుటనుగదా వ్యాకరణమని చెప్పఁబడుచున్నదీ-

ప్రపంచముయొక్క నామరూపవ్యాకరణమంతయును అపరబ్రహ్మమువలనగలిగినదని శ్రుతిప్రసిద్ధముగదా. కాఁబట్టి పరబ్రహ్మము సాక్షాత్తుగా వైయాకరణుఁడు. ఆబ్రహ్మమును విమర్శించుటచేత ఈశ్వరుని శ్రేష్ఠుఁడుగూడ వైయాకరణుఁడనఁబడుచున్నాఁడు. అని శంకరభాష్యము.

ప్రత్యక్షదర్శీ లోకానాం సర్వదర్శీ భవేన్నరః ।
సత్యే వై బ్రాహ్మణస్తిష్ఠన్ తద్విద్వాన్ సర్వవిద్భవేత్ ॥౪౩॥

లోకానాం ప్రత్యక్షదర్శీ నరః సర్వదర్శీ భవేత్= లోకములనన్నిటిని ప్రత్యక్షముగాఁజూచు పురుషుఁడు సర్వజ్ఞుఁడు అగుచున్నాఁడు. బ్రాహ్మణః సత్యే తిష్ఠన్= బ్రాహ్మణుఁడు సత్యమునందు ఉన్నవాఁడై, తత్ విద్వాన్ సర్వవిత్ భవేత్= ఆబ్రహ్మమును తెలిసికొనువాఁడు సర్వజ్ఞుఁడు అగును.

తా॥ సర్వజ్ఞుఁడనఁగా ప్రత్యక్షముగా లోకములనన్నిటిని తెలిసికొనువాఁడు. పరబ్రహ్మమునందె నిష్ఠకలిగి పరబ్రహ్మమునె ఱిఁగినవాఁడు అట్టి సర్వజ్ఞుఁడగును.

జ్ఞానాదిషు స్థితోఽప్యేవం క్షత్రియ బ్రహ్మ పశ్యతి ।
వేదానాం చానుపూర్వ్యేణ హ్యేతద్విద్వాన్ బ్రవీమి తే ॥౪౪॥

హే క్షత్రియ= ఓ క్షత్రియుఁడా, జ్ఞానాదిషు స్థితోఽపి= జ్ఞానాదులలోను ఉన్నవాఁడును, ఏవం బ్రహ్మ పశ్యతి= ఇట్లు బ్రహ్మమును చూచుచున్నాఁడు. వేదానామ్ అనుపూర్వ్యేణచ బ్రహ్మ పశ్యతి= వేదములయొక్క అనుసారమునఁగూడ బ్రహ్మమును తెలిసికొనుచున్నాఁడు. హే విద్వన్ ఏతత్ తే బ్రవీమి= ఓ పండితుఁడా దీనిని నీకు చెప్పుచున్నాఁడను.

తా॥ వెనుకఁజెప్పఁబడినజ్ఞానాదిమహావ్రతములలో నున్నవాఁడు క్రమముగా పరబ్రహ్మమును తెలిసికొనును. వేదానుసారమున నడచువాఁడుగూడ క్రమముగా బ్రహ్మమును తెలిసికొనును. ఈయంశమునే నేనునీకిప్పుడు చెప్పుచున్నాను.

జ్ఞానాదులలో నున్నవాఁడు సయితము వేదాంతశ్రవణము లేనియెడల పరబ్రహ్మజ్ఞానమును పొందఁజాలఁడు. వేదములు వే

దస్వరూపుఁడగు పరబ్రహ్మమును తెలియఁజేయునవియగుటను ఇఁక చెప్పెదను- అనిశంకరభాష్యము-

ఇత్యుద్యోగపర్వాంతర్గతసనత్సుజాతపర్వణి ద్విచత్వారింశోధ్యాయః

ఇట్లుఉద్యోగపర్వములోని సనత్సుజాతపర్వమున నలుబదిరెండవ అధ్యాయము-

## సనత్సుజాతపర్వము-

### ౨ అధ్యాయము-

ధృతరాష్ట్ర ఉవాచ= ధృతరాష్ట్రుడు పలికెను-

సనత్సుజాత యదిమాంపరార్థాం
బ్రాహ్మీంవాచంవదసివిశ్వరూపామ్।
పరాంహికార్యేషుసుదుర్లభాంకథాం
ప్రబ్రూహిమేవాక్యమేవంకుమార ॥౧॥

హే సనత్సుజాత= ఓ సనత్సుజాతుఁడా, పరార్థాం విశ్వరూపామ్ ఇమాం బ్రాహ్మీం వాచం= గొప్ప యర్థము కలదియును అనేక విధములయినదియునగు ఈ బ్రహ్మసంబంధియగు వాక్కును, యత్ వదసి= ఎందువలన చెప్పుచున్నావో, తత్= అందువలన, హే కుమార= ఓ సనత్కుమారుఁడా, ఏవం వాక్యమ్= ఇట్టి వాక్యమైనదియును, కార్యేషు సుదుర్లభాం పరాం కథామ్= కార్యములలో మిక్కిలి దుర్లభమైనదియునగు గొప్పకథను, మే ప్రబ్రూహి= నాకు చెప్పుము-

తా॥ ఓ సనత్సుజాతుఁడా మోక్షసాధనమైన బ్రహ్మతత్త్వమును గూర్చిన యుపదేశమును చేసియున్నావు గాన నీవె బహుదుర్లభమైన మఱియొక గొప్పయుపదేశమును చేయుము-

సనత్సుజాత ఉవాచ= సనత్సుజాతుడు పలికెను-

నైతద్బ్రహ్మత్వరమాణేనలభ్యం
యన్మాంపృచ్ఛస్యభిషంగేణరాజన్।
బుద్ధౌప్రలీనేమనసిప్రచింత్యా
విద్యాహిసాబ్రహ్మచర్యేణలభ్యా ॥౨॥

హే రాజన్= ఓ రాజా, ఏతత్ బ్రహ్మ త్వరమాణేన నలభ్యమ్= ఈ బ్రహ్మము త్వరపడువాని చేత పొందశక్యము కానిది- మాం యత్ అభిషంగేణ పృచ్ఛసి= నన్ను దేనిని శ్రద్ధతో అడుగుచున్నావో- బుద్ధౌ ప్రలీనే మనసి ప్రచిన్త్యా సా విద్యా= బుద్ధియందు లీనమైన మనస్సునందు తలంపవలసిన ఆ విద్య, బ్రహ్మచర్యేణ లభ్యాహి= బ్రహ్మచర్యము చేత పొందతగినదికదా-

తా॥ బ్రహ్మమును పొందుటకు త్వరపడినంతమాత్రమున కార్యములేదు- సంకల్పవికల్పరూపమగు మనస్సును విషయములనుండి మఱలించి పరమాత్మయందు నిశ్చలముగా నుంచుటయనెడు విద్యవలన పొందఁదగినది- ఇందుకు బ్రహ్మచర్యము ప్రధానసాధనము.

ఆద్యాంవిద్యాంవదసిహిసత్యరూపామ్
యాప్రాప్యతేబ్రహ్మచర్యేణసద్భిః ।
యాంప్రాప్యైవంమర్త్యభావంత్యజంతి
యావైవిద్యాగురువృద్ధేషునిత్యా ॥౩॥

సత్యరూపామ్ ఆద్యాం విద్యామ్ వదసిహి- సత్యస్వరూపమైన మొదటి విద్యను ప్రశంసించుచున్నావుగదా- సద్భిః యా బ్రహ్మచర్యేణ ప్రాప్యతే= సత్పురుషులచేతను ఏ బ్రహ్మచర్యమున పొందబడుచున్నదో- యాం ప్రాప్య= దేనిని పొంది, ఏవం మర్త్యభావం త్యజంతి= ఇట్టి మరణమును పొందుచుండువారగుటను విడుచుచున్నారో, యా వై విద్యా గురువృద్ధేషు నిత్యా= ఏ విద్య గురువుచేతవృద్ధిబొందింపఁబడినవారలయెడను నిత్యమైనదో

తా॥ పరమార్థస్వరూపమైనవిద్యను నాకుఁజెప్పుమని నీవు అడుగుచున్నావు ఆవిద్యను సత్పురుషులగువారు బ్రహ్మచర్యముచేత పొందుచున్నారు- ఆవిద్యలభించినతోడనే మాటిమాటికిచచ్చుచుండుటయనెడి యీసంసారముకలుగదు- ఆవిద్యలెస్సగాగురూపదేశమునుపొందినవారికే లభింపఁదగినది-

ధృతరాష్ట్రఉవాచ= ధృతరాష్ట్రుఁడు పలికెను-
బ్రహ్మచర్యేణయావిద్యాశక్యావేదితుమంజసా ।
తత్కథంబ్రహ్మచర్యంస్యాదేతద్విద్వన్బ్రవీహిమే ॥౪॥

యా విద్యా= ఏ విద్యయేదో, సా బ్రహ్మచర్యేణ అంజసా వేదితుం శక్యా= అదిబ్రహ్మచర్యముచేత లెస్సగా పొందుటకు శక్యమైనదికదా- వేదే తత్ బ్రహ్మచర్యమ్ కథం స్యాత్= వేదవిషయమున ఆబ్రహ్మచర్యము ఎట్లు ఉండును, హే విద్వన్ మే బ్రవీహి= ఓ పండితుఁడా నాకు చెప్పుము-

తా॥ విద్యయనునది బ్రహ్మచర్యముచేతనే లెస్సగా పొందశ

ర్యమైనదని చెప్పితిని. వేదమును గూర్చిన బ్రహ్మచర్యమెట్టిదో నాకు చెప్పుము.

సనత్సుజాతఉవాచ= సనత్సుజాతుడు పలికెను-

ఆచార్యయోనిమిహయే ప్రవిశ్య
భూత్వాగర్భం బ్రహ్మచర్యంచరన్తి ।
ఇహైవ తేశాస్త్రకారా భవన్తి
విహాయదేహం పరమంయాన్తిసత్యమ్ ॥౫॥

ఇహ యే ఆచార్యయోనిం ప్రవిశ్య= ఈలోకమున ఎవ్వరు ఆచార్య యోనిని ప్రవేశించి, గర్భం భూత్వా= గర్భము అయి, బ్రహ్మచర్యం చరంతి= బ్రహ్మచర్యమును ఆచరింపుచున్నారో, తే ఇహ శాస్త్రకారాః భవన్తి= వారు ఈలోకమున శాస్త్రములనుజేయువారు అగుదురు- దేహం విహాయ పరమం సత్యం యాంతి= దేహమును విడిచి గొప్పదయి సత్యస్వరూపమైన బ్రహ్మచర్యమును పొందుచున్నారు-

తా॥ ఆచార్యుని దగ్గఱ చేరి ఆతని శిష్యులయి గురుశుశ్రూషాదిరూపమగు బ్రహ్మచర్యము నాచరించువారు, ఈలోకమున శాస్త్రములను చేయదగినంత పండితులుఅగుదురు- అట్టివారు బ్రహ్మజ్ఞానమును సంపాదించుకొని ప్రారబ్ధము నశించినతోడనె పరమాత్మను పొందుదురు-

అస్మిన్ లోకే విజయన్తీహ కామాన్
బ్రాహ్మీంస్థితిమనుతితిక్షమాణాః ।
తఆత్మానంనిర్హరంతీహదేహా
న్ముంజాదిషీకామివధీరభావాత్ ॥౬॥

ఇహ బ్రాహ్మీం స్థితిమ్ అనుతితిక్షమాణాః- ఇచ్చట బ్రహ్మసంబంధియగు స్థితినిగూర్చి సహనమునుపొందుచున్నవారై, అస్మిన్ లోకే కామాన్ విజయన్తి= ఈలోకమున కామములను జయింపుచున్నారు- తే= వారు, ముంజాత్ ఇషీకామివ= ముంజమనెడి గడ్డిలోనుండి కాడనువలె, ఇహ దేహాత్ ఆత్మానమ్ ధీరభావాత్ నిర్హరంతి= ఈలోకమున దేహమునుండి ఆత్మను ధైర్యమువలన బ

యలఁదీయుచున్నారు-

తా॥ మోక్షమును పొందగోరినవారు ఓరిమిగలవారై విషయములను జయింతురు- వారు తమ ఆత్మను గడ్డిలోనుండి వెన్నెకాడను ఊడఁదీసినట్లు ఈశరీరములోనుండి ఆత్మను ఊడఁదీసికొని మోక్షమును చెందుదురు-

శరీరమేతౌ కురుతః పితా మాతా చ భారత ।
ఆచార్యతస్తు యజ్జన్మ తత్సత్యం వై తథామృతమ్ ॥౭॥

హే భారత= ఓభరతవంశమువాఁడా, ఏతౌ పితా మాతా చ శరీరం కురుతః= ఈ తండ్రియును తల్లియును శరీరమును కలుగఁజేయుచున్నారు- ఆచార్యతః యత్ జన్మ (భవతి)= ఆచార్యునివలన ఏ జన్మము (కలుగుచున్నదో), తత్ సత్యం తథా అమృతంచ (భవతి) వై= అది సత్యంబును అట్లె అమృతంబును అగుచున్నదిగదా-

తా॥ తల్లిదండ్రులు శరీరమును కలుగఁజేయుదురు- ఆచార్యుఁడు తానెలుఁగని యాత్మ తత్త్వమును తెలియఁజేసి ఆత్మ జ్ఞానమును పట్టి తనకుకొ్రొత్త జన్మమును కలుగఁజేసినవాఁడు కాన ఆజన్మము సత్యమనియును అమృతమనియును చెప్పఁబడును- సత్యశబ్ద వాచ్యుఁడగు భగవంతుని సంబంధముగల జన్మముగాన సత్యమనఁబడును- మోక్షమును కలుగఁజేసెడి జన్మముగాన అమృతమనబడును-

ఆచార్యోపదేశమువలన కలిగిన తానె పరబ్రహ్మమని తెలిసికొనుటయనెడి జన్మము నిజమైనదిగాన సత్యమనఁబడును. అని శంకరభాష్యము.

స ఆప్నోత్యమృతం సంప్రయచ్ఛన్
తస్మై న ద్రుహ్యేత్కృతమస్య జానన్ ।
గురుం శిష్యో నిత్యమభివాదయీత
స్వాధ్యాయమిచ్ఛేచ్ఛ సదాప్రమత్తః ॥౮॥

సః అమృతం సంప్రయచ్ఛన్ ఆప్నోతి= అతఁడు మోక్షమును ఇచ్చుచు ఆవరింపుచున్నాఁడు- అస్య కృతమ్ జానన్= ఈతని ఉపకారమును తలంచుచు, అస్మై న ద్రుహ్యేత్= ఈతనికి ద్రోహము చేయఁగూడదు- శిష్యః గురుం నిత్యమ్ అభివాదయీత= శిష్యుఁడు

గురువును నిత్యము నమస్కరించునది- కించ=ఇంతియె కాక, సదా అప్రమత్తః స్వాధ్యాయమ్ ఇచ్ఛేత్=ఎల్లప్పుడును పరాకు లేనివాఁడై చదువును కోరునది.

తా॥ గురువు శిష్యుని అమృతముతో నావరించుచున్నాఁడు- అనఁగా నీతనికి బ్రహ్మజ్ఞానమును కలుగఁజేయుచున్నాఁడు- ఆచార్యుఁడు తనకు చేసిన యుపకారమును ఎల్లప్పుడును తలంచుకొనుచుండి ఆతనికి విరుద్ధమైన కార్యమును చేయఁగూడదు నిత్యమును గురువునకు నమస్కరించి ఆయన వలన దీవనలు పొందుచుండునది- శ్రద్ధతోఁగూడినవాఁడై చదివికొనునది-

అభివాదయేత అని యుండవలసినదానికి అభివాదయీత అని యుండుట ఆర్షము-

శిష్యవృత్తిక్రమేణైవ విద్యామాప్నోతి యచ్ఛుచిః।
బ్రహ్మచర్యవ్రతస్యాస్య ప్రథమః పాద ఉచ్యతే॥౯॥

శుచిస్సన్ శిష్యవృత్తిక్రమేణైవ విద్యామ్ ఆప్నోతీతి యత్= పరిశుద్ధుఁడగుచు శిష్యుఁడుండవలసిన తీరుననె విద్యను పొందుచున్నాఁడను నది యేది కలదో, తత్ అస్య బ్రహ్మచర్యస్య ప్రథమః పాదః ఉచ్యతే=అది ఈ బ్రహ్మచర్యమునకు మొదటి పాదముగా చెప్పఁబడుచున్నది-

తా॥ తాను పరిశుద్ధుఁడై యుండి గురువు యొద్ద తానుండవలసిన రీతిని ఉండుచు చదువుకొనుట యనునది బ్రహ్మచర్యములో మొదటి యంశము-

యథా నిత్యం గురౌ వృత్తిః గురుపత్న్యాం తథా చరేత్।
పుత్రేషు చ తథా కుర్వన్ ద్వితీయః పాద ఉచ్యతే॥౧౦॥

నిత్యం గురౌ వృత్తిః యథా= నిత్యంబును గురువు యెడను ప్రవర్తించుట ఎట్లో, తథా గురుపత్న్యాం చరేత్= అట్లె గురువు భార్య యెడను ప్రవర్తించునది- పుత్రేషు చ తథా కుర్వన్ (స్యాత్)= గురుపుత్రుల యెడనను అట్లె చేయువాఁడు (కావలయును)-(అయం) ద్వితీయః పాదః ఉచ్యతే=(ఇది) రెండవ పాదముగా చెప్పఁబడుచున్నది-

తా॥ తాను గురువు నెడను ఎట్లు సంచరించునో గురువు భార్య

యెడనును గురువుపుత్రులయెడనును అట్లు సంచరించునది-ఇది బ్రహ్మ
చర్యముయొక్క రెండవయంశము.

ఆచార్యేణాత్మకృతం విజానన్
జ్ఞాత్వాచార్థంభావితోస్మీత్యనేన।
యన్మన్యతేతంప్రతిహృష్టబుద్ధి
స్సతృతీయోబ్రహ్మచర్యస్యపాదః॥౧౧॥

ఆచార్యేణ ఆత్మకృతం విజానన్=ఆచార్యుని చేతను తనకుఁజేయఁబడినదానిని తెలిసికొనుచు, అర్థంజ్ఞాత్వా=పరమార్థమును తెలిసికొని,తంప్రతి హృష్టబుద్ధిస్సన్=ఆయాచార్యునిగూర్చి సంతోషించిన బుద్ధిగలవాఁడై, అనేన భావితః అస్మి ఇతి మన్యత ఇతి యత్=ఈతనిచేత కలుగఁజేయఁబడినవాఁడను అయితిని అనితలంచుచున్నాఁడనుట పదికలదో, సః బ్రహ్మచర్యస్య తృతీయః పాదః=అది బ్రహ్మచర్యముయొక్క మూఁడవ పాదము-

తా॥ఆచార్యునివలన పరమార్థమును తెలిసికొని ఆచార్యుఁడు తనకుఁజేసిన యుపకారమును తలంచునది- అదియెట్లన్నను. ఈ జ్ఞానము కలిగినపైనికదా నేనొకవస్తువుగానైతిని అనిఆచార్యునివలన తానుక్రొత్తగాఁగలిగినట్లుతలంచుకొనుచు ఆచార్యుఁడుతలంపునకు వచ్చినపుడెల్ల నతిసంతోషముతోనుండునది. ఇదిబ్రహ్మచర్యముయొక్కమూఁడవయంశము,

ఆచార్యాయప్రియంకుర్యాత్ప్రాణైరపిధనైరపి।
కర్మణామనసావాచాచతుర్థఃపాదఉచ్యతే॥౧౨॥

కర్మణా మనసా వాచా=పనిచేతనును మనస్సుచేతనును వాక్కుచేతనును.ప్రాణైరపి ధనైరపి ఆచార్యాయ ప్రియం కుర్యాత్=ప్రాణములతోనను-ధనములతోనును ఆచార్యునకు ఇష్టమును చేయునది-(అయం)చతుర్థః పాదః ఉచ్యతే= ఇదినాల్గవ పాదముగా చెప్పఁబడుచున్నది

తా॥మనఃపూర్వకముగా ఆచార్యునకుఇష్టమైన పనిచేయవలయును- ఇష్టమైనమాటను ఆడవలయును-తనప్రాణమునకు భంగమువచ్చినను తనధనమునకుభంగమువచ్చినను ఆచార్యునిఇష్టమునతి

క్రమింపఁగూడదు. ఇది నాల్గవయంశము-

కాలేన పాదంలభతే తథాయం
తథాచ పాదం గురుయోగతశ్చ।
ఉత్సాహయోగేనచ పాదమృచ్ఛే
చ్ఛాస్త్రేణ పాదం చతతోపియాతి॥ ౧౩॥

అయం కాలేన పాదం తథా లభతే= ఈతఁడు కాలముచేత నాల్గవవంతును అట్లు పొందును- తథా గురుయోగతశ్చ పాదం లభతే= అట్లె గురువును చేరుటవలన నాల్గవవంతును పొందును- ఉత్సాహయోగేన పాదమ్ ఋచ్ఛేత్=ఉత్సాహముకలుగుటను నాల్గవవంతును పొందును- శాస్త్రేణ పాదంచ ఋచ్ఛేత్=శాస్త్రముచేత నాల్గవవంతును పొందును- తతః యాతిపి= అటుపయిని లాభమును పొందుచున్నాఁడుగదా.

తా॥ విద్యకుఁగూడ నాల్గు పాదములుకలవు- తగినకాలము సమకూడుట యొక్క పాదము- గురువుదగ్గఱ చేరుట రెండవపాదము- అటపైని చదువునందు శ్రద్ధ గలిగియుండుట మూడవపాదము- అటపైని తానుచదివిన శాస్త్రములవలన నాలుగవవంతుకలుగును- ఇట్లు నాలుగువంతుల విద్యయును లభించినతోడనె పరమపురుషార్థము కలుగును-

కాలమనఁగా బుద్ధియొక్క పరిపాకము- ఉత్సాహమనఁగా బుద్ధియొక్క వైభవము- శాస్త్రమనఁగా తనతోడఁజదువువారితో చర్చచేయుట- ఈశ్లోకములోఁ నవరుస సరియైనవరుస కాదు- అని శంకరభాష్యము-

జ్ఞానాదయో ద్వాదశ యస్యరూప
మన్యానిచాంగానితథా బలంచ।
ఆచార్యయోగే ఫలతీతి చాహు
బ్రహ్మార్థయోగేనచ బ్రహ్మచర్యమ్ ॥ ౧౪॥

జ్ఞానాదయః ద్వాదశ యస్య రూపమ్= జ్ఞానము మొదలయిన పండ్రెండు దేని రూపమో, అన్యాని అంగాని= మిగిలినవి అంగములో, తథా బలంచ అంగమ్= అట్లె బలముగూడ అంగమో, తత్ ఆచార్యయోగే ఫలతీతిచ ఆహుః= అది ఆచార్యయోగమున ఫలించుచు

న్నదని చెప్పుచున్నారు. తత్ బ్రహ్మార్థయోగేన బ్రహ్మచర్యమ్ భవతి- అది బ్రహ్మమనెడివస్తువుయొక్క సంబంధము చేత బ్రహ్మచర్యము అగుచున్నది-

తా॥ బ్రహ్మచర్యమునకు వెనుకఁజెప్పఁబడిన జ్ఞానాదులు స్వరూపము. (౨అ॥౧౯శ్లో) సత్యధ్యానాదులు (అ॥శ్లో)అంగములు- బలముఅనఁగా ఓపికకూడ అంగమె- ఇవియన్నియును ఆచార్యుఁడుకలిగియున్ననెఫలించుననిచెప్పెదరు- బ్రహ్మచర్యశబ్దమునకు బ్రహ్మమును గూర్చిన చర్యయని యర్థము-

జ్ఞానాదులు ఏపురుషునకురూపమో- ఆపురుషునకుజ్ఞానాదులన్నియును ఆచార్యసంబంధముననె ఫలించును- గురుశుశ్రూషాదిరూపమైన బ్రహ్మచర్యము బ్రహ్మజ్ఞానముకలుగుటనె ఫలించును అనిశంకరభాష్యము-

ఏతేనబ్రహ్మచర్యేణ దేవా దేవత్వమాప్నువన్ ।
ఋషయశ్చమహాభాగాబ్రహ్మచర్యేణ చాభవన్ ॥౧౭॥
ఏతేనైవసగంధర్వాస్రూపాణ్యప్సరసోజయన్ ।
ఏతేనబ్రహ్మచర్యేణసూర్యఅహ్నాయజాయతే ॥౧౮॥

ఏతేన బ్రహ్మచర్యేణ దేవాః దేవత్వమ్ ఆప్నువన్- ఈబ్రహ్మచర్యము చేతనె దేవతలు దేవత్వమును పొందిరి-మహాభాగాః ఋషయశ్చ బ్రహ్మచర్యేణచ అభవన్- గొప్పభాగ్యముగల ఋషులుగూడ బ్రహ్మచర్యముచేతనె అయిరి- సగంధర్వాః అప్సరసః ఏతేనైవ రూపాణి అజయన్- గంధర్వులతోఁగూడిన అచ్చరలు దీనిచేతనె సౌందర్యములను గెలిచిరి- ఏతేన బ్రహ్మచర్యేణ సూర్యః అహ్నాయ జాయతే- ఈబ్రహ్మచర్యముచేతను సూర్యుఁడు లోకములను ప్రకాశింపఁజేయుటకొఱకు అగుచున్నాడు-

తా॥ దేవతలుబ్రహ్మచర్యమునాచరించియె దేవత్వమునుపొందిరి- ఋషులుగూడ బ్రహ్మచర్యముచేతనె అంతవారయిరి- అచ్చరలకును గంధర్వులకును సౌందర్యాతిశయము దీనింబట్టి వచ్చినదె- అనిబ్రహ్మచర్యము స్తోత్రముచేయఁబడుచున్నది-

ఆకాంక్ష్యార్థస్యసంయోగాద్రసభేదార్థినామివ।

ఏవం హ్యేతత్సమాజ్ఞాయ తాదృగ్భావంగతా ఇమే ॥౧౭॥

రసభేదార్థినామివ ఆకాంక్ష్యార్థస్య సంయోగాత్ — రసభేదములనుకోరువారికివలె కావలసిన ప్రయోజనము కలుగుటవలన. ఏతత్ ఏవం సమాజ్ఞాయ — ఈబ్రహ్మచర్యమును ఇట్లు తెలిసికొని, ఇమే తాదృగ్భావం గతాహి — వీరు అట్టివారగుటను పొందిరిగదా.

తా॥ చింతామణి మొదలగునవి ఎవ్వరేదికోరుదురో వారికి దానినిచ్చును. అట్లే ఈబ్రహ్మచర్యముగూడ ఏదికావలసినవారికి దానినిచ్చును. కాన దేవతలు మొదలగువారు వారివారి ఇష్టములను దీనివలన సాధించుకొనిరి.

అన్తవతః క్షత్రియ తే జయన్తి
లోకాన్ జనాః కర్మణా నిర్మితేన ।
జ్ఞానేన విద్వాంస్తేజ అభ్యేతి నిత్యం
న విద్యతే హ్యన్యథా తస్య పన్థాః ॥౧౮॥

తే జనాః నిర్మితేన కర్మణా = ఆజనులు చేయబడిన కర్మముచేత, అన్తవతః లోకాన్ జయన్తి = అంతముగల లోకములను జయించుచున్నారు. విద్వాన్ జ్ఞానేన నిత్యం తేజః అభ్యేతి = జ్ఞానియగువాడు జ్ఞానముచేత నిత్యమైన తేజస్సును చేరుచున్నాడు. తస్య అన్యథా పన్థాః నవిద్యతేహి — ఆచేరుటకు మఱియొక్కవిధముగా మార్గము లేదు.

తా॥ కర్మములనాచరించువారలకు కలుగులోకములు కొంతకాలమె అనుభవింపవలసినవై అనిత్యములైయుండును. జ్ఞానులుతమజ్ఞానముచేత పరబ్రహ్మమును చేరుదురు. అది అనంతముగానుండును. అదియెమోక్షము. ఈమోక్షమును చెందుటకు జ్ఞానముతప్ప మఱివేరుమార్గములేదు.

ధృతరాష్ట్ర ఉవాచ — ధృతరాష్ట్రుడు పలికెను.

ఆభాతి శుక్లమివ లోహితమివాథో
కృష్ణమథాఞ్జనం కాద్రవం వా ।
యద్బ్రహ్మణః పశ్యతి యత్ర విద్వాన్
కథం రూపం తదమృతమక్షరం పదమ్ ॥౧౯॥

యత్ర యత్ విద్వాన్ బ్రాహ్మణః పశ్యతి= ఎచ్చట దేనిని జ్ఞానియగు బ్రాహ్మణుఁడు చూచునో- (తత్ర) అమృతమ్ అక్షరం తత్ పదమ్= అచ్చటనుండెడి అమృతంబున్నుఅక్షరంబునగు ఆపదము, శుక్లమివ ఆభాతివా= తెల్లనిదిగా తోచునా, లోహితమివ ఆభాతివా- ఎఱ్ఱనిదిగా తోచునా, అథోకృష్ణమివ ఆభాతివా= ఇఁకనల్లనిదిగా తోచునా, అథ అర్జునమివ ఆభాతివా=ఇఁక కొంచెమెరుపుకలిసినతెల్లనివలె తోచునా, కాద్రవమ్ఆభాతివా-పచ్చనిదిగాతోచునా-కథంరూపమే=ఏట్టిరంగుకలది-

తా॥ బ్రహ్మజ్ఞానికి కలిగెడి బ్రహ్మదర్శనము ఏరంగుగానుండును-

సనత్సుజాత ఉవాచ=సనత్సుజాతుఁడు పలికెను-

నాభాతిశుక్లమివలోహితమివాథో
కృష్ణమర్జునం వాకాద్రవంవా।
నపృథివ్యాం తిష్ఠతి నాన్తరిక్షే
నైతత్సముద్రే సలిలం బిభర్తి॥౨౦॥

శుక్లమివవా లోహితమివవా అథోకృష్ణమివవా అర్జునమివవా కాద్రవమివవా నాభాతి- తెల్లనిదివలెకాని ఎఱ్ఱనిదివలెకాని ఇఁకనల్లనిదివలెకాని అర్జునమువలెకాని పచ్చనిదివలెకాని స్ఫురింపదు- పృథివ్యాం నతిష్ఠతి= భూమిలోను ఉండదు- అంతరిక్షే నతిష్ఠతి= ఆకాశములోనును ఉండదు- సముద్రే సలిలమ్ ఏతత్ నబిభర్తి- సముద్రములోని నీరుదీనిని భరింపుచుండలేదు-

మోక్షానుభవము తెలుపు మొదలగు రంగులతోనుండదు- ఆ మోక్షస్థానము మనకు కనఁబడెడి భూమిలోకాని ఆకాశములోఁగానఁసముద్రములోఁగాని లేదు- ఈప్రపంచమున కంతటికిని వెలిగానుండునని ముందు(౨-౨శ్లో॥) చెప్పఁబడును-

ఏతత్ సముద్రే సలిలం నబిభర్తి= ఈ బ్రహ్మము సముద్రములోని నీటిని భరింపదు- అనఁగాపంచభూతాత్మకమైన దేహమును భరింపదనుట- బ్రహ్మము సంసారములోఁ జేరునేని యుండ మొదలగువానివలె వస్తువుగానుండుటయు రంగులు మొదలగునవి క

లిగి యుండుటయు ఒకదాని నాశ్రయించియుండుటయు సందర్భించును. ఈబ్రహ్మము అపూర్వమైనదిగాన సంసారములో చేరకున్నది. కావుననే రూపాదులు లేనిది అని తాత్పర్యము. అని శంకరభాష్యము.

నచక్షుషా తన్న యజుష్షు నాప్యథర్వసు
నదృశ్యతే వైవిమలేషు సామసు।
రథంతరే బార్హద్రథే వాపి రాజన్
మహావ్రతే నైవదృశ్యేద్ధ్రువంతత్ ॥౨౧॥

హేరాజన్ = ఓరాజా, తత్ ఋక్షుచ నదృశ్యతే= అది ఋక్కుల లోఁగూడ కనఁబడదు. యజుష్షువాపి నదృశ్యతే= యజుస్సులలోనైనను కనఁబడదు. అథర్వసు నదృశ్యతేవై= అథర్వవేదమంత్రముల లో కనఁబడదుగదా. విమలేషు సామసు నదృశ్యతేవై= పరిశుద్ధములైన సామములయందు కనఁబడదుకదా. ధ్రువం తత్= నిత్యమైన ఆపదము, రథంతరే బార్హద్రథే మహావ్రతేపివా నైవదృశ్యతే= రథంతరమను సామమునందుగాని బార్హదిథమను సామమునందుగానీ మహావ్రతమునందుగాని కనఁబడదు.

దృశ్యేత అనియుండవలసినదానికి దృశ్యేత్ అనియుండుట ఆర్షము.

తా॥ ఆనోక్తము వేదములలోఁ జేరిన ఒకటిమంత్రముకూడ కాదు.

అవారణీయంతమసః పరస్తాత్
త్తదంతతోభ్యేతివినాశకాలె।
అణీయరూపంచతథాప్యణీయసాం
మహత్స్వరూపంత్వపిపర్వతేభ్యః ॥౨౨॥

తత్ తమసః పరస్తాత్ అస్తి= అది ఈసంసారమునకు వెలుపల నున్నది. అంతతః వినాశకాలె తత్ అవారణీయం అభ్యేతి= తుదను వినాశకాలంబున అది నివారింపశక్యముకానిదై లభింపుచున్నది. తత్ తథాఽపి అణీయసామ్ అణీయరూపమ్ భవతి= అది అల్పమైనను చిన్నవానికి చిన్నదైనస్వరూపముగలది అగుచున్నది. పర్వతే

శ్యతి మహాత్స్వరూపమపి భవతి- పర్వతములకంటె గొప్పస్వరూపము కలదియును అగుచున్నది-

తా॥ మోక్షస్థానము ఈసంసారములోఁ జేరినది కాదు- ఆ మోక్షమనునది జ్ఞానికి ఈశరీరము పోయినతోడనె తప్పక లభించును- ఆమోక్షములోననుభవింపఁబడెడి పరబ్రహ్మము అన్నివస్తువులను లోపలను వెలుపలనుగూడ వ్యాపించియుండుటవలన చిన్నవానికన్న చిన్నదియును పెద్దవానికన్న పెద్దదియునైయున్నది.

అణీయోరూపమ్ అనియుండవలసిన దానికి అణీయరూపమ్ అనియుండుట ఆర్షప్రయోగము-

పరబ్రహ్మము అవారణీయము అనగా ఒకరినిచేత వారింపశక్యముకానిది- వినాశకాలమునందుఁగాని ప్రళయకాలమునందు గాని ఉండునది ఆ బ్రహ్మమొకటియె- అని శంకరభాష్యము.

తదేతదహ్నా సంస్థితం భాతి సర్వం
తదాత్మవిత్పశ్యతి జ్ఞానయోగాత్।
తస్మిఞ్జగత్సర్వమిదం ప్రతిష్ఠితం
యేతద్విదురమృతాస్తే భవంతి॥ ౨౩॥

తదేతత్ సర్వమ్ అహ్నా సంస్థితమ్ భాతి- ఆయీపరబ్రహ్మము అంతయును ప్రకాశములోను ఉన్నదై ప్రకాశించుచున్నది- ఆత్మవిత్ జ్ఞానయోగాత్ తత్ పశ్యతి- పరమాత్మజ్ఞానముకలవాఁడు జ్ఞానయోగమువలన దానిని చూచుచున్నాఁడు, తస్మిన్ ఇదం సర్వం జగత్ ప్రతిష్ఠితమ్- ఆబ్రహ్మమునందు ఈ సమస్తమైన జగత్తును నిలచియున్నది, యే తత్ విదుః- ఎవ్వరు దానిని తెలిసికొందురో, తే అమృతాః భవన్తి- వారు ముక్తులు అగుదురు-

తా॥ ఈబ్రహ్మము ప్రకాశముకలది- ఆప్రకాశమును పరమాత్మజ్ఞానముకలవాఁడు తనజ్ఞానయోగమునచూచును- జగత్తునకంతటికిని ఆపరబ్రహ్మము ఆధారము- ఆపరబ్రహ్మమును తెలిసికొన్నవారు ముక్తులగుదురు,

ఇత్యుద్యోగపర్వాన్తర్గత సనత్సుజాతపర్వణి త్రిచత్వారింశోఽధ్యాయః॥

ఇట్లు ఉద్యోగపర్వములోజేరినసనత్సుజాతపర్వంబున ౪౩వ అధ్యాయము-

## సనత్సుజాతపర్వము.

### ౪ అధ్యాయము.

సనత్సుజాత ఉవాచ= సనత్సుజాతుఁడు పలికెను.

శోకః క్రోధశ్చ లోభశ్చ కామో మానః పరాసుతా।
ఈర్ష్యా మోహో విధిత్సా చ కృపాసూయా జుగుప్సతా ॥౧॥
ద్వాదశైతే మహాదోషా మనుష్యప్రాణనాశకాః।
ఏకైకమేతే రాజేంద్ర మనుష్యాన్ పర్యుపాసతే।
యైరావిష్టో నరః పాపం మూఢసంజ్ఞో వ్యవస్యతి ॥౨॥

శోకః క్రోధశ్చ లోభశ్చ= దుఃఖంబును క్రోధంబును ఆశయును, కామః మానః పరాసుతా= కామంబును మానంబును నిద్రాపరత్వంబును, ఈర్ష్యా మోహః విధిత్సా చ= ఈర్ష్యయును తెలివిలేకపోవుటయును విషయములనుపొందగోరుటయును, కృపా అసూయా జుగుప్సతా= తనవారలయెడను స్నేహంబును అసూయయును పరులగుణములను లేవనుటయును, ఏతే ద్వాదశ మనుష్యప్రాణనాశకాః మహాదోషాః= ఈ పండ్రెండును మనుష్యప్రాణములనునశింపఁజేసెడి గొప్పదోషములు. హే రాజేంద్ర= ఓరాజశ్రేష్ఠుఁడా, ఏతే ఏకైకం మనుష్యాన్ పర్యుపాసతే= ఇవి ఒక్కొక్కటిగా మనుష్యులను ఆశ్రయింపుచున్నవి. యైః ఆవిష్టః నరః= వేనిచేత ఆవేశింపఁబడిన మనుష్యుఁడు, మూఢసంజ్ఞః (సన్) పాపం వ్యవస్యతి= తెలివిలేనివాఁడగుచు పాపకార్యము చేయునో.

తా॥ ఈక్రోధాదులు పండ్రెండును మనుష్యునిచెడగొట్టునవి. ఇవిఒకదానియపేక్ష ఒకదానికి లేకయె మనుష్యుల నాశ్రయించియుండును. ఈదోషములనుపట్టియె మనుష్యుఁడు తెలివితక్కువవాఁడై పాపకార్యములను చేయఁదలపడును.

స్పృహయాలురుగ్రః పరుషో వదాన్యః
క్రోధం బిభ్రన్మనసా వై వికత్థీ।
నృశంసధర్మాః షడిమే జనా వై
ప్రాప్యాప్యర్థం నోత సభాజయంతే ॥౩॥

స్పృహయాలుః ఉగ్రః పరుషః వదాన్యః= ఆశకలవాఁడును దయ

లేనివాఁడును పెటుకుమాటలాడువాఁడును అధికప్రసంగియును, మనసా క్రోధం బిభ్రత్ = మనస్సునకోధమును ఉంచుకొనువాఁడును, వికత్థీ ఉత నృశంసధర్మా=తన్ను శ్లాఘించుకొనువాఁడును ఇంతియెకాక క్రూ వ్యాపారముకలవాఁడును, ఇమే షట్ జనాః- ఈ ఆఱుగురు జనులును, అర్థం ప్రాప్యాపి=ఉపకారమును పొందియును, నసభాజయన్తే= పరులనులక్ష్యపెట్టరు-

తా॥ స్పృహయాళువు మొదలగు నాఱుగురును తనకుఉపకారముచేసిన వానినైనను గౌరవింపరు-

సంభోగసంవిద్విషమోతిమానీ
దత్త్వావికత్థీకృపణోదుర్బలశ్చ ;
బహుప్రశంసీవనితాద్విట్సదైవ
సప్తైవోక్తాఃపాపశీలానృశంసాః ॥౮॥

సంభోగసంవిత్ విషమః అతిమానీ = సంభోగమునబుద్ధికలవాఁడును ఒడుదుడుకుస్వభావముకలవాఁడును అతిగర్వముకలవాఁడును, దత్త్వా వికత్థీ= ఇచ్చి పొగడికొనువాఁడును, కృపణః దుర్బలశ్చ - స్వల్పధనమునకైయెననవమానమునులక్ష్యపెట్టనివాఁడును జ్ఞానబలములేనివాఁడును, బహుప్రశంసీ సదైవ వనితాద్విట్= ఆత్మస్తుతిచేసికొనువాఁడును ఎల్లప్పుడును తనభార్యయెడను ద్వేషముకలవాఁడును, సప్తైవ పాపశీలాః నృశంసాః ఉక్తాః= ఈ యేడుగురె పాపస్వభావులైన క్రూరులుగా చెప్పఁబడిరి-

తా॥ సంభోగసంవిత్తు మొదలగు నేడుగురు అతిక్రూరులనియును పాపస్వభావులనియును చెప్పఁబడిరి-

ధర్మశ్చసత్యంచతపోదమశ్చ
హ్యమాత్సర్యంహ్రీస్తితిక్షానసూయా ।
ధ్యానంశ్రుతంచైవధృతిఃక్షమాచ
మహావ్రతాద్వాదశబ్రాహ్మణస్య ॥౯॥

ధర్మశ్చ సత్యంచ తపః దమశ్చ=ధర్మకార్యములను చేయుటయును సత్యముపలుకుటయును తపస్సును ఇంద్రియనిగ్రహంబును, అమాత్సర్యం హ్రీః తితిక్షా అనసూయా= మత్సరములేకపోవుటయును తగ్గని

కార్యము చేయుటయు ఒందలిసిగ్గును శీతోష్ణాదిద్వంద్వములను సహించు టయును అసూయలేకపోవుటయును, ధ్యానం శ్రుతంచైవ ధృతిః క్షమాచ= ధ్యానంబును చదువును ధైర్యంబును ఓరిమియును, (ఇతి) ద్వాదశ బ్రాహ్మణస్య మహావ్రతాః=(అనెడి) పండ్రెండు బ్రాహ్మణునకు మహావ్రతములు-

తా॥ ధర్మాదులు పండ్రెండు బ్రహ్మజ్ఞానము సంపాదించి కొనువానికుండవలసిన గొప్పవ్రతములు-

మహావ్రతాని అనుటకు బదులుగా మహావ్రతాః అని యుండుట ఆర్షము-

శంకరభాష్యమున మహావ్రితాఅని విసర్గరహితముగా పదచ్ఛేదము చేయఁబడి వేదములోనుండెడి బహువచనమునకు ఆర్షప్రయోగమని తెలియఁజేయఁబడినది-

యేంవై తేభ్యః ప్రచ్యవేద్ద్వాదశభ్యః
సర్వామపీమాంపృథివీంసశిష్యాత్ ।
త్రిభిర్ద్వాభ్యామేకతోవాధితోయో
నాస్యస్వమస్తీతిచ వేదితవ్యమ్ ॥౬॥

యోవై తేభ్యః ద్వాదశభ్యః ప్రచ్యవేత్ =ఎవ్వఁడు ఆ పండ్రెండి నుండి జారునో, సః ఇమాం పృథివీం సర్వామపి శిష్యాత్= వాఁడు ఈ భూమిని అంతటిని శాసించును- త్రిభిః ద్వాభ్యామ్ ఏకతో వా అధితః యః= మూడింటిచేతనుగాని రెండింటిచేతనుగాని ఒక్కదానిచేతనుగాని కోఱబడియున్నవాఁడు ఎవ్వఁడో, అస్య స్వం నాస్తీతిచ వేదితవ్యమ్= వీనికి స్వకీయమైనది లేదనియును తెలిసికొనఁదగినది-

తా॥ ఈ పండ్రెంటిని నడిపించి వాంటిని దాటినవాఁడు జ్ఞాని యగును- ఆతనికి ఈభూమినంతటిని ఏలుచున్నవానికి ఎంతఆనందముకలిగియుండునో, అంతఆనందము కలిగియుండును- ఒకటి రెండు మూడు తక్కువైయుండినను ఆతనికి ఈసంసారమునందు మమకారమేమియునుండదు-

వీనిలోనొకటి రెండు మూడు అవలంబించినవాఁడుగూడనై

రాగ్యముకలవాఁడై యుండునని శంకరభాష్యము-

దమస్త్యాగోథాప్రమాదఇత్యేతేష్వమృతంస్థితమ్ ।
ఏతానిబ్రహ్మముఖ్యానాం బ్రాహ్మణానాంమనీషిణామ్॥౭॥

దమః త్యాగః అథ అప్రమాదః= ఇంద్రియనిగ్రహము వైరాగ్యము ఇఁకను ప్రమాదములేకుండుట, ఇత్యేతేషు అమృతమ్ స్థితమ్= అనువీనియందు మోక్షము ఉన్నది- ఏతాని బ్రహ్మముఖ్యానాం మనీషిణామ్ బ్రాహ్మణానాం (భవన్తి)=ఇవి బ్రహ్మమె ప్రధానముగాఁగలవారును స్థిరచిత్తులునగు బ్రాహ్మణులకు (కలుగుచున్నవి).

తా॥ దమాదులు మూఁడును ఎవ్వరియెడను కలిగియుండునో వారికి మోక్షము చేతనున్నదె- ఇవి బ్రహ్మమును పొందుటనె కోరు మనోనిగ్రహముతోనున్న బ్రాహ్మణులకె కలుగును-

ఈశ్లోకము శంకరభాష్యమున వ్యాఖ్యానము చేయఁబడలేదు-

సద్వాసద్వాపరీవాదో బ్రాహ్మణస్యనశస్యతే।
నరకప్రతిష్ఠాస్తేస్యు ర్యఏవంకుర్వతేజనాః ॥౮॥

సద్వా అసద్వా (భవతు)- మంచిదికానీ చెడ్డదిగానీ (కావచ్చును). బ్రాహ్మణస్య పరీవాదః నశస్యతే= బ్రహ్మజ్ఞానికి నింద తగదు- యే జనాః ఏవం పరీవాదం కుర్వతే= ఏ జనులు ఇట్లు నిందను చేతురో, తే నరకప్రతిష్ఠాః స్యుః= వారు నరకమునందుండువారు అగుదురు-

తా॥ ఒక్కటిమంచిదైనను చెడ్డదైనను బ్రహ్మజ్ఞానికి అప్రసక్తియక్కఱలేదు- కాఁబట్టి ఈతఁడు దేనినినిందింపఁగూడదు- ఇట్లు మంచిచెడ్డలను ఆలోచించి నిందించువారు నరకమునఁనుండవలసినవారు-

మదోష్టాదశదోషఃస్యాత్పురాయోత్రప్రకీర్తితః ।
లోకద్వేష్యంప్రాతికూల్యమభ్యసూయామృషావచః ॥౯॥
కామక్రోధౌపారతంత్ర్యంపరీవాదోథపైశునమ్।
అర్థహానిర్వివాదశ్చమాత్సర్యంప్రాణిపీడనమ్ ॥౧౦॥
ఈర్ష్యామోదోతివాదశ్చసంజ్ఞానాశోభ్యసూయితా।
తస్మాత్ప్రాజ్ఞోనమాద్యేతసదాహ్యేతద్విగర్హితమ్ ॥౧౧॥

అత్ర పురా యః పరికీర్తితః— ఈగ్రంథమున పూర్వము ఏది చెప్పఁబడినదో, (సః)మదః అష్టాదశదోషః స్యాత్— (ఆ) మదము పదునెనిమిదిదోషములుకలది అగును- (ఆదోషంబులెవ్వియన్నను) లోకద్వేషమ్ ప్రాతికూల్యం అభ్యసూయా మృషావచః— జనులకువిరోధముగాప్రవర్తించుట ధర్మకార్యాదులకువిఘ్నముచేయుట గుణములయెడనుదోషమునారోపించుట అసత్యముపలుకుట, కామక్రోధౌ పారతన్త్ర్యం పరివాదః అథ పైశునమ్— కామంబునుక్రోధంబును మత్తుఎక్కియుండుట నింద ఇఁక కొండెములుచెప్పుట, అర్థహానిః వివాదశ్చ— ధనమునుదుర్వినియోగముచేసిపాడుచేసికొనుట వివాదపడుట, మాత్సర్యం ప్రాణిపీడనమ్— మత్సరము ప్రాణులనుహింసించుట, ఈర్ష్యా మదః అతివాదశ్చ— ఈర్ష్యయును గర్వమునుకలిగించెడిసంతోషంబును మిక్కిలిగామాటలాడుటయును, సంజ్ఞానాశః అభ్యసూయితా— తెలివిలేకయుండుటయును ఎప్పుడునుఇతరులదోషములనెబయలుపుచ్చుచుండుటయును- తస్మాత్ ప్రాజ్ఞః నమాద్యేత— అందువలన ప్రాజ్ఞుఁడు మదమునుపొందఁగూడదు- ఏతత్ సదా విగర్హితంహి— ఈమదమునుపొందుట ఎల్లప్పుడును నిందింపఁబడినదిగదా-

తా॥ వెనుకనిరూపింపఁబడిన మదమునకు లోకద్వేషము మొదలగు పదునెనిమిది దోషములుకలవు- గాన ప్రాజ్ఞుఁడగువాఁడు మదమును పొందగూడదు- ఈ మదము పెద్దలచేత ఎల్లప్పుడునిందింపఁబడుచుండును-

లోకద్వేషమనఁగా పరస్త్రీగమనాదికమని శంకరభాష్యమున వివరింపఁబడినది-

సౌహృదే వై షడ్గుణా వేదితవ్యాః
ప్రియే హృష్యన్త్యప్రియే చ వ్యథన్తే।
స దాత్మనస్సుహితం యాచతే యో
దదాత్యయాచ్యమపి దేయం ఖలు స్యాత్ ॥౧౨॥
ఇష్టాన్ పుత్రాన్విభవాన్ స్వాంశ్చ దారా
నభ్యర్థితశ్చార్హతి శుద్ధభావః।

త్యక్తద్రవ్యస్సంవసేన్నేహ కామా
ద్భుఙ్త్కే కర్మ స్వాశిషం బాధతేచ ॥౧౩॥

సౌహృదే షట్ గుణాః వేదితవ్యావై= స్నేహమున ఆఱు గుణములు తెలిసికొనఁదగినవికదా- ప్రియే హృష్యన్తి= ఇష్టముకలిగినప్పుడు సంతోషింపుదురు- అప్రియే వ్యథన్తే= అనిష్టముకలిగినప్పుడు దుఃఖింతురు- ఆత్మనః సుహితం సత్ యః యాచతే= తనకు మిక్కిలియిష్టమైన మంచివస్తువును ఏమిత్రుఁడు యాచించునో, (తస్మై తత్) దదాతి= (వానికి దానిని) ఇచ్చుచున్నాఁడు. అయాచ్యమపి దేయం స్యాత్ఖలు =కోరఁదగనిది గూడ ఇవ్వఁదగినది అగును గదా- ఇష్టాన్ పుత్రాన్ విభవాన్ స్వాం దారాంశ్చ అభ్యర్థితః= ఇష్టులయిన పుత్రులను ఐశ్వర్యములను తన భార్యను యాచింపఁబడినవాఁడై, శుద్ధభావః దాతుమ్ అర్హతి= పరిశుద్ధమైనయంతఃకరణముకలవాఁడై ఇచ్చుటకు తగుచున్నాఁడు- త్యక్తద్రవ్యః కామాత్ ఇహ నసంవసేత్= ఈబడినద్రవ్యముకలవాఁడు యథేష్టము ఈతనిఇంటను ఉండఁడు- కర్మ భుఙ్త్కే = తనపనివలనవచ్చినదానిని అనుభవించును- స్వాశిషం బాధతేచ= తనమేలును గూడ చెడగొట్టుకొనును-

తా॥ స్నేహమున నాలుగుణములు కలవు- తనస్నేహితునకు మేలుగలిగినప్పుడు సంతోషించుట మొదటిది- వానికికీడుకలిగినప్పుడు దుఃఖించుట రెండవది- స్నేహితుడడిగినయెడను తనకుమిక్కిలిప్రీతివిషయమైనవస్తువునైనను ఇచ్చును- ఆతడుఅడిగినప్పుడు ఈఁదగనిదిఒకటియైననుండదు- తనకుమిక్కిలిఇష్టులైన కొడుకులను తనయైశ్వర్యమును తుదకుతనభార్యనైన మిత్రుఁడు కోరినయెడను తనమనస్సున సంకోచమేమియును లేకయె యిచ్చును- ఇదిమూడవది- తానుసర్వస్వము నిచ్చియున్నను వానియింటచాలకాలముండి వాని సొమ్మునగ వినియోగపడును- ఇదినాల్గవది- ఏమియులేకున్నను తనకష్టార్జితముననే బ్రతుకుచుండును- ఇదిఅయిదవది- మిత్రునిమేలుకొఱకు తనమేలునుగూడచెడఁగొట్టుకొనును- ఇదిఆఱవది-

ఇచ్చట శంకరభాష్యమున దేయమ్ అయాచ్యమపి యా

చ తే= దాతను యాచింపఁదగని దాని గూడ యాచింపుచున్నాడు- అని యోజన చేయబడినది-

దరిద్ర్యవాన్ గుణవానేవం త్యాగీ భవతి సాత్త్వికః।
పఞ్చభూతాని పఞ్చభ్యో నివర్తయతి తాదృశః ॥౧౪॥

దరిద్ర్యవాన్ ఏవం గుణవాన్ ఏవం త్యాగీ= దరిద్ర్యము కలవాఁడును ఇట్లు గుణవంతుఁడును ఇట్లు త్యాగియునగువాఁడు, సాత్త్వికః భవతి =సత్త్వప్రధానుఁడు అగుచున్నాఁడు- తాదృశః పఞ్చభూతాని పఞ్చభ్యః నివర్తయతి = అట్టి వాఁడు అయిదు ఇంద్రియములను అయిదు విషయములనుండి నివర్తింపఁజేయుచున్నాఁడు-

తా॥ దరిద్ర్యము కలిగియుండి వెనుకఁజెప్పఁబడిన గుణములు కలవాఁడు సాత్త్వికుఁడైన త్యాగియగుచున్నాఁడు- వాఁడు విషయములయందు ఇంద్రియములను ప్రవర్తింపనీఁడు-

ఏతత్సమృద్ధమప్యూర్ధ్వం తపో భవతి కేవలమ్ ।
సత్త్వాత్ ప్రచ్యవమానానాం సంకల్పేన సమాహితమ్ ॥౧౫॥

సత్త్వాత్ ప్రచ్యవమానానాం సంకల్పేన సమాహితమ్ ఏతత్ తపః= ధైర్యమునుండి జారుచున్నవారలకు కోరికతో కూడికొనిన ఈ తపస్సు, సమృద్ధమపి ఊర్ధ్వం కేవలం భవతి= సమృద్ధమైయున్నను తరువాతను కేవలము అగును-

తా॥ ఇట్లు విషయములనుండి ఇంద్రియములను నివర్తింపఁజేయుటయనెడి తపస్సు ఫలమును గోరక పరమేశ్వరుని జెందుటకై చేయబడిన యెడను సమృద్ధమగును- అది యెవ్వని ధైర్యలోపము చేత ఫలమును కోరి చేయఁబడునో వాని కేవలము తపస్సు అగును-

వైరాగ్యము లేక బ్రహ్మలోకాదులను పొందవలెనని కోరెడి వారి తపస్సు జ్ఞానమువలె నిచ్చటనే కార్యకరము కానేరదు- ఊర్ధ్వలోకములగు బ్రహ్మాదిలోకములను కలుగఁజేసి దానిద్వారమున కైవల్యమును కలుగఁజేయును- అని శంకరభాష్యము-

యతో యజ్ఞాః ప్రవర్ధన్తే సత్యస్యైవావధారణాత్ ।
మనసాన్యస్య భవతి వాచాన్యస్యాథ కర్మణా ॥౧౬॥

యతః యజ్ఞాః ప్రవర్ధన్తే= దేనివలన యజ్ఞములు వృద్ధిబొందు

నో, తస్య సత్యస్యైవ అవధారణాత్= ఆ సత్యము నె తప్పకయుం డుటవలన, అన్యస్య మనసా (యజ్ఞః) భవతి= లోకవిలక్షణ మైన వానికి మనస్సుచేతనె (యజ్ఞము) అగుచున్నది- అన్యస్య వాచా భవతి= మఱియొకనికి వాక్కుచేతనే అగుచున్నది- అథ అన్యస్య కర్మణా భవతి= ఇంక మఱియొకనికి కర్మము చేతనే అగుచున్నది-

తా॥ యజ్ఞములు మూఁడువిధములు- మానసికయజ్ఞములును వాచికయజ్ఞములును కాయికయజ్ఞములునని-అందుమానసికయజ్ఞములను ఆచరించువారు ఉత్తములు-వాచికయజ్ఞములనాచరించువారు మధ్యములు- కాయికయజ్ఞములను ఆచరించువారు అధములు-

సంకల్పసిద్ధంపురుషమసంకల్పోఽధితిష్ఠతి।
బ్రాహ్మణస్యవిశేషేణకించాన్యదపిమేశృణు ॥౧౭॥

అసంకల్పః సంకల్పసిద్ధం పురుషమ్ అధితిష్ఠతి= సంకల్పములేనివాఁడు సత్యసంకల్పుఁడగు పరమేశ్వరుని చేరుచున్నాఁడు- విశేషేణ బ్రాహ్మణస్య (అవశ్యమ్) కించ అన్యదపి= విశేషముగా బ్రహ్మజ్ఞునికి (ఆవశ్యక మైన) ఇదిగాక మఱియొక దానినిగూడ, మే శృణు= నావలన వినుము-

తా॥ కోరికయేమియును లేక తపస్సు నాచరించువాఁడు సత్యసంకల్పుఁడగు పరమేశ్వరునిచేరును- బ్రహ్మజ్ఞునికి ఉండవలసినదిఇంకమఱియొకటిగూడకలదు-దానినిగూడ చెప్పెదను- వినుము-

పూర్వార్థము సగుణబ్రహ్మోపాసకుని గూర్చినదనియును ఉత్తరార్థము నిర్గుణబ్రహ్మోపాసకుని గూర్చినదనియును శంకరభాష్యము- బ్రాహ్మణుఁడనఁగా నిర్గుణోపాసకుఁడు-

అధ్యాపయేన్మహదేతద్యశస్యం
వాచోవికారాఃకవయోవదన్తి।
అస్మిన్ యోగేసర్వమిదంప్రతిష్ఠిత
మేతద్విదురమృతాస్తేభవన్తి ॥౧౮॥

యశస్యం మహత్ ఏతత్ అధ్యాపయేత్= కీర్తినికలుఁగఁజేయునదియును గొప్పదియునగు ఈ యోగశాస్త్రమును శిష్యులచేతఁజదివింపవలయును- (అన్యాని) వాచః వికారా(ఇతి) కవయః వదన

న్తి= (మిగిలినశాస్త్రములు) వాక్కు యొక్క వికారములని పూర్వ ఋషులు చెప్పుచున్నారు- అస్మిన్ యోగే ఇదం సర్వం ప్రతిష్ఠితమ్= ఈ యోగశాస్త్రమున ఇది అంతయును నిలిచియున్నది- (యే) ఏ తత్ విదుః= (ఎవ్వరు) దీనిని ఎఱుంగుదురో, తే అమృతాః భవ న్తి= వారుముక్తులు అగుచున్నారు-

తా॥ యోగియగువాఁడు ఈ యోగశాస్త్రమును శిష్యులకు ఉపదేశించుచునుగూడ నుండవలయును- మిగిలిన శాస్త్రములన్నియు నింత యుపయోగకారులు కావు- ఈయోగశాస్త్రములో నంతయు నిమిడియున్నది- ఈయోగశాస్త్రమును లెస్సగా తెలిసికొనినవారు మోక్షమును పొందుదురు.

నకర్మణా సుకృతేనైవ రాజన్
సత్యం జయే జ్జుహుయాద్వా యజేద్వా।
నైతేన బాలోఽమృత్యు మభ్యేతి రాజన్
రతిం చా సౌనలభ త్యన్తకాలే ॥౧౯॥

(హే) రాజన్= (ఓ) రాజా, జుహుయాద్వా= హోమము చేసినను, యజేద్వా= యజ్ఞము చేసినను, సుకృతేన కర్మణైవ సత్యం నజయేత్= లెస్సగాఁజేయఁబడిన కర్మము చేతనే సత్యమును జయింపలేఁడు- ఏతేన (సహితః) బాలః= ఈకర్మముతో (కూడుకొనిన) అజ్ఞుఁడు, (హే) రాజన్ అమృత్యుమ్ నాభ్యేతి= (ఓ) రాజా మోక్షమును పొందలేఁడు. అసౌ అన్తకాలే రతించ నలభతి= ఈ తఁడు శరీరావసానకాలమున ఆనందమునుగూడ పొందఁడు-

తా॥ జ్ఞానమె మోక్షసాధనము- హోమములు యజ్ఞములు మొదలగునవి ఎంతలెస్సగాఁజేయఁబడినను మోక్షమును కలుగఁజేయవు- ఈకర్మముల నాచరించువాఁడు అజ్ఞానియె- వీఁడు మరణానంతరము మోక్షానందమును చెందలేఁడు-

తూష్ణీమేక ఉపాసీత చేష్టేత మనసాపిన।
తదా సంస్తుతిన్నిన్దాభ్యాం ప్రీతిరోషౌ వివర్జయేత్ ॥౨౦॥

ఏకః తూష్ణీమ్ ఉపాసీత= ఒంటరియై ఊరక ఉపాసనచేయునది- మనసాఽపి నచేష్టేత= మనస్సునఁగూడ పనిచేయఁగూడదు- త

డా॰ సంస్తుతినిన్దాభ్యాం ప్రీతిరోషౌ వివర్జయేత్ — అప్పుడు పరుల స్తోత్రనిందలవలనఁగలిగెడి ప్రీతినికోపమునును విడుచునది.

తా॥ ఒంటరిగా నెమ్మదిగానుండి యుపాసనచేయునది. మనస్సుతో దేనినైనను తలంచుటనుగూడ మానునది. ఎవ్వఁడైనను స్తోత్రముచేసినచో సంతోషింపంగూడదు. నిందించినచోఁగోపపడగూడదు.

అత్రైవ తిష్ఠన్ క్షత్రియ బ్రహ్మావిశతి పశ్యతి ।
వేదేషు చానుపూర్వ్యేణ హ్యేతద్విద్వన్ బ్రవీమి తే॥ ౨౧॥

(హే) క్షత్రియ= (ఓ) క్షత్రియుఁడా. అత్రైవ తిష్ఠన్= ఈ ధ్యానమునందె ఉన్నవాఁడయి, బ్రహ్మ ఆవిశతి= బ్రహ్మమును చేరుచున్నాఁడు. బ్రహ్మ పశ్యతి= బ్రహ్మమును చూచుచున్నాఁడు. వేదేషు చ ఆనుపూర్వ్యేణ ఏతత్ వర్తతే= వేదములలోఁగూడ క్రమముగాను ఇదియె (ఉన్నది). (హే) విద్వన్= (ఓ) తెలిసినవాఁడా, ఏతత్ (అహం) తే బ్రవీమి= దీనిని (నేను) నీకు చెప్పుచున్నాను.

తా॥ ఇట్లు నిశ్చలమనస్కుఁడుగానుండుటయనెడి ధ్యానమున నున్నవాఁడు పరిశుద్ధాత్మయగును. పరమేశ్వరుని చూచును. వేదములలో క్రమమున తుదకు ఈయంశమె చెప్పఁబడినది. ఆ పరబ్రహ్మముయొక్క స్వరూపమును ఇఁక నీకు నేను ఉపదేశించెదను.

బ్రహ్మ ఆవిశతి= బ్రహ్మమును చొచ్చుచున్నాఁడు. అనఁగా బ్రహ్మమే అయిపోవుచున్నాఁడు. వేదములనఁగా జ్ఞానములు. అజ్ఞానములలో వరుసవరుసగా మెట్లులనెక్కి యున్నవాఁడు బ్రహ్మమయిపోవును. అని శంకరభాష్యము.

ఇత్యుద్యోగపర్వాన్తర్గత సనత్సుజాతపర్వణి చతుశ్చత్వారింశోఽధ్యాయః.

ఇట్లు ఉద్యోగపర్వములోని సనత్సుజాతపర్వమున నలుబది నాలుగవ యధ్యాయము.

౬ అధ్యాయము॥

యత్తచ్ఛుక్రం మహజ్జ్యోతిర్దీప్యమానం మహద్యశః ।
యద్వైదేవా ఉపాసతే యస్మాదర్కో విరాజతే ॥౧॥
యోగినస్తం ప్రపశ్యన్తి భగవన్తం సనాతనమ్ ।

యత్ తత్ శుక్రమ్ మహాత్ దీప్యమానం జ్యోతిః= ఎవ్వఁడు తత్ అనుశబ్దముచేతఁజెప్పఁబడునదియును పరిశుద్ధమైనదియును గొప్పదియును ప్రకాశింపుచున్నదియునగు తేజస్సో, (యత్) మహాత్ యశః=ఎవ్వఁడు గొప్ప కీర్తియైనవాఁడో, యత్ దేవాః ఉపాసతే వై= ఎవ్వనిని దేవతలు ఉపాసింపుచున్నారో, యస్మాత్ అర్కః విరాజతే= ఎవ్వనివలన సూర్యుఁడు ప్రకాశింపుచున్నాఁడో, సనాతనం తం భగవన్తమ్= పురాణుఁడైన ఆ భగవంతుని, యోగినః ప్రపశ్యన్తి= యోగులు చూచుచున్నారు-

తా॥ పరమేశ్వరుఁడు పరిశుద్ధమైన గొప్ప తేజస్సు అయిన వాఁడు- తత్ అనుశబ్దముచేత చెప్పఁబడువాఁడు- ఆతని దేవతలందఱును ధ్యానము చేయుచుందురు- లోకములోని వెలుగులకన్నిటికిని గొప్పవాఁడగు సూర్యుఁడు వెలుఁగుటకుఁగూడ నాతఁడె కారణము- ఆతఁడు ధ్యానముచేయువారిధ్యానమున కనఁబడును-

శుక్లాద్బ్రహ్మ ప్రభవతి బ్రహ్మ శుక్లేన వర్ధతే ॥౨॥
తచ్ఛుక్లం జ్యోతిషాంమధ్యేఽతప్తం తపతి తాపనమ్ ।

బ్రహ్మ శుక్లాత్ ప్రభవతి= ప్రకృతి పరమాత్మవలన సమర్థమగుచున్నది- బ్రహ్మ శుక్లేన వర్ధతే= ప్రకృతి పరమాత్మచేతనే వృద్ధిబొందుచున్నది- తత్ శుక్లమ్= ఆ పరబ్రహ్మము, జ్యోతిషాం మధ్యే అతప్తమ్= జ్యోతిస్సుల లోపల ఒకదానిచేతఁబ్రకాశింపఁజేయఁబడనిదై, తాపనం (సత్) తపతి= అన్నిటిని బ్రకాశింపఁజేయునది అగుచు) ప్రకాశింపుచున్నది-

తస్మాదేతద్బ్రహ్మ నామరూపమన్నంచ జాయతే (          )
అను శ్రుత్యర్థము పూర్వార్థముచేత తెలియజేయఁబడినది.

తా॥ ఈప్రకృతి, సంసారముగా వికరించుటకుఁ దగిన సామర్థ్యము కలదియగుట, ఆపరమేశ్వరుని సంకల్పముననె- సంసార

రూపముగా విస్తరించుటగూడ ఆపరమేశ్వరుని సంకల్పముననె-
బ్రహ్మమనఁగా హిరణ్యగర్భుఁడు- అతఁడె విరాడ్రూపము
గా వృద్ధినిబొందును- అని శంకర భాష్యము-

పూర్ణాత్పూర్ణముద్ధరన్తి పూర్ణాత్పూర్ణం ప్రచక్షతే॥ 3॥
హరన్తి పూర్ణాత్పూర్ణంచ పూర్ణమే వావశిష్యతే।

పూర్ణాత్ పూర్ణమ్ఉద్ధరన్తి= జ్ఞానానందపూర్ణుఁడగు భగవంతునివల ననే తాపత్రయముతోనిండియుండెడిజీవుని లేవదీయుచున్నా రు- పూర్ణం పూర్ణాత్ ప్రచక్షతే = జ్ఞానానందపూర్ణమై నమోక్షమును జ్ఞానానందపూర్ణుఁడైనభగవంతునివలననె చెప్పుచున్నారు- పూర్ణాత్ పూర్ణం హరన్తి = పరమేశ్వరునివ ల్లనె నిండుగానున్నతాపత్రియమును పోఁగొట్టుకొనుచున్నారు- పూర్ణమేవ అవశిష్యతే = జ్ఞానానందపూర్ణమైనఆత్మవ స్తువె మిగులును-

తా॥ ఈయాత్మ తాపత్రియ పూర్ణమైన ఈసంసారము ను దాటుటకును జ్ఞానానంద పూర్ణమైన మోక్షమును పొందుట కును భగవంతుఁడె సాధనము- ఆతని దయలేక ఈరెండును లభింప వు- ఈసంసారములోనెచ్చటఁజూచినను నిండియున్న తాపత్రయము ను పోఁగొట్టువాడు ఆభగవంతుఁడె- ఇవిపోయినతరువాత నిలిచె డియాత్మస్వరూపము జ్ఞానానందపూర్ణమై యుండును-

ఇఁకశంకర భాష్యయోజన చెప్పఁబడును- పూర్ణాత్ పూర్ణమ్ ఉద్ధరన్తి = అపరిచ్ఛిన్నుఁడయినపరమాత్మనుండియె జీ వుని కలుగఁజేయుచున్నారు- పూర్ణాత్ పూర్ణం ప్రచక్షతే= పూర్ణునివలన( కలిగినవాఁడుగాన) పూర్ణునిగానె చెప్పుచు న్నారు- పూర్ణాత్ పూర్ణం హరన్తి= ఈజీవునినుండి పరమా త్మస్వరూపమును హరించుచున్నారు- పూర్ణమేవ అవశిష్యతే= పరమాత్మస్వరూపమె మిగులును-

తా॥ దేశకాలవస్తుపరిచ్ఛేదములేని పరమాత్మవలననె జీ వుని కలుగఁజేయుచున్నారు-అనఁగా పరమాత్మనె జీవునిగాఁదలం చుచున్నారనుట-ఇట్లు పరమాత్మవలన గలుగుటను జీవునిపరమాత్మ

నుగానె చెప్పుచున్నారు- దేహేంద్రియాదులలో ప్రవేశించిన ఈజీవుని దేహేంద్రియాదులనుండి విడదీసి స్థూలదేహము సూక్ష్మదేహము అనఁగా లింగశరీరము అనెడి రెండు దేహములనుండియు బయలు దీయుచున్నారు-తరువాతను పూర్ణానందమైనబ్రహ్మమె మిగులును-

ఆపో ధాద్భ్య స్సలిలం తస్య మధ్యే
స్స్యుభౌ దేవౌ శిశ్రియాతే నన్తరిక్షే॥౪॥
ఆదధ్రిచీ స్సవిషూచీర్వసానా
వుభౌబిభర్తి పృథివీం దివంచ।

ఆపః (సృష్టాః) = పఞ్చభూతములు (సృజింపఁబడినవి) - అద్భ్యః సలిలం (సృష్టమ్) = భూతములవలన శరీరము సృజింపఁబడినది- తస్యమధ్యే అన్తరిక్షేఉభౌదేవౌ శిశ్రియాతే=దాని నడుమను హృదయాకాశమున ఇద్దఱు ఆత్మలు ఆశ్రయించియున్నారు- సవిషూచీః ఆదధ్రిచీః వసానా ఉభౌ= ఉపదిక్కులతోఁగూడిన దిక్కులను ఆచ్ఛాదింపుచున్న ఇద్దఱును, పృథివీం దివంచ బిభర్తి= భూమినిని ఆకాశమునను భరింపుచున్నారు-

బిభృతః అని ద్వివచన ముండవలసిన దానికి ఏకవచనము ఆర్షము-

తా॥ పరమాత్మచేత పంచభూతములునుసృజింపఁబడినవి- ఆపరమాత్మయె పంచభూతములతో శరీరములను సృజించెను- ఆపరమాత్మయును జీవాత్మయును ఆశరీరములలోని హృదయములను ఆశ్రయించియున్నారు- అందు జీవుఁడు పృథివిని అనఁగా తన కర్మఫలములకు తగిన దేహాదికమును భరింపుచున్నాఁడు- పరమాత్మ ప్రకాశమానమగు తనస్వరూపమును భరింపుచున్నాఁడు-

చక్రే రథస్య తిష్ఠన్తం ధ్రువ స్యాత్యయకర్మణః ॥౫॥
కేతుమన్తం వహన్త్యశ్వా స్తం దివ్య మజరందివి।

అత్యయకర్మణః ధ్రువస్య రథస్య చక్రే తిష్ఠన్తమ్= నాశస్వభావము గలదై ఎప్పటికి నుండునదియైయున రథముయొక్క చక్రమునందు ఉన్నవాఁడును, కేతుమన్తం దివ్యమ్అజరమ్=జ్ఞానముకలవాఁడును

అపా)కృతుఁడును నిర్వికారుఁడునగు, తమ్ అశ్వాః దివి వహన్తి= ఆతనిని గుఱ్ఱములు ఆకాశమున నడపుచున్నవి-

తా॥ రథచక్రమనఁగా శరీరము-అశ్వములనఁగా ఇంద్రియములు- ఒకశరీరము నశించినను మఱియొక శరీరము లోకములో కలిగియె యుండునుగాన శరీరములేదనుమాట యుండదు. అట్టి శరీరములో నుండెడి జీవుని, యోగాభ్యాస పరిశుద్ధములగు ఇంద్రియములు పరమాత్మను చేర్చుచున్నవి-

నసందృశే తిష్ఠతి రూపమస్య
నచక్షుషా పశ్యతి కశ్చనైనమ్ ॥౬॥
మనీషయా మనసా హృదాచ
యఏనం విదురమృతాస్తే భవన్తి।

అస్య రూపం సందృశేనతిష్ఠతి=ఈతని రూపము ఒకదానిసాటిలో ఉండదు. కశ్చిదపి ఏనమ్ చక్షుషా నపశ్యతి=ఎవ్వఁడును ఈతనిని కండ్లతో చూడలేఁడు- మనీషయా మనసా హృదాచ=ధైర్యముచేతనును మనస్సుచేతనును భక్తిచేతనును, యే ఏనం విదుః= ఎవ్వరు ఈతనిని తెలిసికొందురో, తే అమృతాః భవన్తి= వారు ముక్తులు అగుదురు -

తా ॥ ఈతని స్వరూపమునకు సాటియైనది లేదు- ఈతనిని కంటితో చూడలేరు - ధైర్యముకలవారై మనస్సుచేత ఈతనిని ధ్యానముచేసి తెలిసికొనువారు ముక్తులగుదురు -

ద్వాదశ పూగాస్సరితో దేవరక్షితాః ॥ ౭ ॥
మధ్వీశతే తదా సంసరన్తి ఘోరమ్ ।

దేవరక్షితాః పూగాః ద్వాదశ సరితః = దేవునిచేతరక్షింపఁబడిన గుంపుగుంపులుగానుండెడి పండ్రెండు నదులు, మధు ఈశతే = మధురమైనదానిని పలుచున్నవి - తదా ఆత్మానః ఘోరం సంసరన్తి = అప్పుడు ఆత్మలు ఘోరముగా సంసారమును చెందుచున్నారు -

తా ॥ పండ్రెండు నదులనునవి కర్మేంద్రియము లయిదున్ను జ్ఞానేంద్రియము లయిదును మనస్సును బుద్ధియును అనునవి -

ఇవి ప్రసరించెడి స్వభావము కలవిగాన సరిత్తులనఁబడును - ఇవి ప్రతిశరీరమును బండెగ్రిండేసియుండునుగాన పూగములు అనఁగా సముదాయములు అనఁబడును - ఇవి పరమాత్మచేతనే రక్షింపఁబడుచుండును - ఎవ్వని ఈయింద్రియములు వానివానివిషయములను వేఱువేఱుగా అనుభవింపుచుండునో, వాఁడు, ఘోరమైన సంసారమును చెందుచుండును - కాఁబట్టి ఇంద్రియములను విషయములనుండి మఱలించి తనవశమున నుంచికొనవలయును -

తదర్ధమాసం పిబతి సంచితం భ్రమరో మధు ॥ ౮ ॥
ఈశాన స్సర్వభూతేషు హవిర్భూత మకల్పయత్ ॥

అర్ధమాసం సంచితం తత్ మధు = అర్ధమాసము కూడఁబెట్టఁబడిన ఆతేనెను, భ్రమరః పిబతి = తుమ్మెద త్రాగుచున్నది - ఈశానః సర్వభూతేషు హవిర్భూతమ్ అకల్పయత్ = ఈశ్వరుఁడు అన్నిభూతములయందును హవిస్సైనదానిని కల్పించెను -

తా ॥ సంసారియగువాఁడు తిరుగుచుండుటయె స్వభావముగాఁగలవాఁడుగాన భ్రమరమని చెప్పఁబడుచున్నాఁడు - ఆ సంసారి వెనుక సంపాదించిన కర్మఫలమును తరువాతికాలమున ననుభవింపుచున్నాఁడు - పరమేశ్వరుఁడె అన్నికర్మముల ఫలమునును అనుభవింపఁజేయును -

హిరణ్యపర్ణ మశ్వత్థ మభిపత్య హ్యపక్షకాః ॥ ౯ ॥
తే తత్ర పక్షిణో భూత్వా ప్రపతన్తి యథాసుఖమ్ ।

అపక్షకాః హిరణ్యపర్ణమ్ అశ్వత్థమ్ అభిపత్య = ఱెక్కలులేనివారు బంగారపుఆకులుగల రావిచెట్టును చేరి, తే తత్ర పక్షిణః భూత్వా = వారు అచ్చట ఱెక్కలుగలవారు అయి, యథాసుఖం ప్రపతన్తి = సుఖముతప్పకుండునట్లు సంచరింతురు -

తా॥ ఱెక్కలులేనివారు అనఁగా జ్ఞానములేని వారు, సంసారమును చేరుదురు - అందుప్రశస్తమయినజన్మమును పొంది జ్ఞానముగలవారై మోక్షమును చెందుదురు -

అపానం గిరతి ప్రాణః ప్రాణం గిరతి చన్ద్రమాః ॥ ౧౦ ॥
ఆదిత్యో గిరతే చన్ద్రమాదిత్యం గిరతేపరః ।

ప్రాణః అపానం గిరతి= ప్రాణము అపానమును మ్రింగుచున్నది- ప్రాణం చన్ద్రమాః గిరతి= ప్రాణమును చంద్రుఁడు మ్రింగుచున్నాఁడు- చన్ద్రమ్ ఆదిత్యః గిరతే= చంద్రుని సూర్యుఁడు మ్రింగుచున్నాఁడు- ఆదిత్యం పరః గిరతే= సూర్యుని పరుఁడు మింగుచున్నాఁడు-

తా॥ చంద్రుఁడనగా మనస్సు- సూర్యుఁడనగా బుద్ధి- పరుఁడనఁగా ఆత్మ- యోగసమాధిలో అపానమును ప్రాణమునఁజేర్చి ప్రాణమును మనస్సునఁజేర్చి మనస్సును బుద్ధిలోఁజేర్చి బుద్ధిని పరమాత్మలోఁ జేర్పవలయును -

ఏకం పాదం నోత్క్షిపతి సలిలాద్ధంస ఉచ్చరన్ ॥౧౧॥
తం చేత్సతత ముత్క్షిపే న్నమృత్యు ర్నామృతం భవేత్।

హంసః సలిలాత్ ఉచ్చరన్= హంసము నీటిలోనుండి బయలుదేరుచు, ఏకం పాదం నోత్క్షిపతి = ఒక్క పాదమును ఎత్తదు- సతతం తమ్ ఉత్క్షిపేచ్చేత్ = ఎల్లప్పుడునుండెడి దానిని ఎత్తునేని, మృత్యుః నభవేత్= మృత్యువు లేకపోవును- అమృతమ్ నభవేత్= అమృతము లేకపోవును-

తా॥ సలిలమనఁగా శరీరము- హంసమనఁగా జీవుఁడు- ఈజీవుఁడు ఈశరీరమును విడిచిపోవునప్పుడు లింగశరీరమును విడువకయె యుండును- ఆలింగశరీరమును గూడ విడుచునేని ఈలోకములోని అనుభవంబులును స్వర్గాదిలోకములలోని అమృతపానాద్యనుభవంబులును లేకపోవును-

ఇచ్చట శంకర భాష్యమున అవిద్యను పోఁగొట్టువాఁడుగాన హంసమనఁగా పరబ్రహ్మమనియును ఒక్కపాదమనఁగా జీవుఁడనియును చెప్పఁబడి, సంసారమునకు వెలిగానె యుండెడి పరబ్రహ్మము జీవుఁడనెడి యొక్కపాదమును ఉపసంహరింపఁడు- ఎల్లప్పుడును వ్యాపరింపుచుండెడి ఆజీవుని నెప్పు డుపసంహరించునో అనఁగా తనమాయచేత తనస్వరూపమునె ప్రాణము మొదలగు ననంతములయిన భేదములు గలదానినిగాఁజేసి దానిలోఁజొచ్చి జీవుఁడుగా నుండఁడో అప్పుడు జీవుఁడనుమాటయె లేకపోవునుగాన సం

-సారమె యుండదు- సంసారమె లేకపోవుటను సంసారమునుండు చుటయనెడి మోక్షముగూడ లేకపోవును, అని వ్యాఖ్యానము చేయఁబడినది-

అఙ్గుష్ఠమాత్రః పురుషో౽న్తరాత్మా
లిఙ్గస్య యోగేన సయాతి నిత్యమ్॥౧౨॥
తమీశ మీడ్య మనుకల్ప మాద్యం
పశ్యన్తి మూఢా నవిరాజమానమ్।

లిఙ్గస్య యోగేన అఙ్గుష్ఠమాత్రః అన్తరాత్మా సః పురుషః= హృదయాకాశముయొక్క సంబంధముచేత బొటనవ్రేలంతవాఁడై అంతరాత్మయైన ఆపరమపురుషుఁడు, నిత్యం యాతి= జీవుని పొందియున్నాఁడు- ఈశమ్ ఈడ్యమ్ అనుకల్పమ్ ఆద్యమ్ విరాజమానం తమ్= ఈశ్వరుఁడును స్తోత్రముచేయఁబడఁదగినవాఁడును సత్యసంకల్పుఁడును మొదటివాఁడును ప్రకాశించువాఁడునగు అతనిని, మూఢాః నపశ్యన్తి= అజ్ఞానులు చూడలేరు-

తా॥ పరమాత్మ జీవుల నందఱిని వ్యాపించియున్నాఁడు- ఈయీశ్వరుని మూర్ఖులు తెలిసికొనలేరు.

ఇచ్చట శంకరభాష్యమున, పరమాత్మయె లింగశరీరముయొక్క సంబంధముచేత ఎల్లప్పుడును సంసారమును పొందుచున్నాఁడు- ఇట్లుసంసారులు కలుగుటకు కారణము బ్రహ్మజ్ఞానము లేకపోవుటయె యని యుత్తరార్థము చెప్పుచున్నది- యోగులగువారు ఆపరబ్రహ్మమును తెలిసికొనిముక్తులగుదురు-, అనివ్యాఖ్యానముచేయఁబడినది-

గూహన్తిసర్పాఇవ గహ్వరేషు
క్షయం నీత్వా స్వేనవృత్తేనమర్త్యాన్॥౧౩॥
తే విప్రముహ్యన్తి జనా విమూఢా
స్తైర్దత్తా వైమోహాయ న్తేభయాయ।

(ఇన్ద్రియాణి) స్వేన వృత్తేన మర్త్యాన్ క్షయం నీత్వా=(ఇంద్రియములు)తమదైన నడతచేత మనుష్యులను క్షయమును పొందించి, గహ్వరేషు సర్పాఇవ గూహన్తి= గుహలలో పాములవలె దాగి

యుండును. తే విమూఢాః జనాః విప్రముహ్యన్తి = ఆ మూఢులైన జనులు విశేషముగా మోహమును జెందుదురు- తైః దత్తాః (విషయాః) మోహయన్తే= వానిచేత ఈఁబడిన (విషయములు) మోహమును కలుగఁజేయుచున్నవి- (తత్) భయాయ (భవతి)= (అది) భయముకొఱకు (అగుచున్నది)

తా॥ పాములు తమకు దొరికిన మనుష్యులను చంపి తిరిగియు గుహలలో దాగియుండునట్లు ఇంద్రియములు గూడ మనుష్యులను విషయములయందు ప్రవర్తింపఁజేసి చెడఁగొట్టుచు దాగియుండును- ఇట్లు విషయాసక్తులై మూఢులైనజనులు మిక్కిలిగా మోహమును చెందుచునే యుందురు- ఆయింద్రియములవలనఁగలిగిన విషయమోహము సంసారమును కలుగఁజేసి భయావహమైయుండును-

అసాధనా వాపి ససాధనా వా
సమానమేత ద్దృశ్యతే మానుషేషు ॥౧౪॥
సమానమేత దమృత స్యేతరస్య
హ్యేవం యుక్తో మధుతద్వై పరీప్సేత్ ॥

(విషయాః) అసాధనా వా అపివా ససాధనాః (భవన్తి)- (విషయములు) అసాధ్యములయినను లేక సాధ్యములైనను (అగుచున్నవి) ఏతత్ మానుషేషు సమానం దృశ్యతే - ఇది మనుష్యులయందు సమానముగా కానఁబడుచున్నది- ఏతత్ అమృతస్య ఇతరస్యచ సమానం హి- ఇదిమోక్షమునకును మిగిలినదానికిని సమానముగదా- ఏవం యుక్తః = ఇట్లు సాధనానుష్ఠానముకలవాఁడై, తత్ మధు పరీప్సేద్వై=ఆ తేనెను పొందఁగోరునది-

తా॥ లోకములోని విషయములు కొన్ని ప్రయత్నము చేసినచో సాధ్యములగునవి గాను కొన్ని సాధ్యములు కానివిగాను ను ఉన్నవి- మనుష్యులు ఈ రెండువిధములయిన విషయములకును ప్రయత్నము చేయుట కానఁబడుచున్నది- కాఁబట్టి మోక్షము అసాధ్యమని లోచినను పరివర్తింప వలయును- ఇట్లు పరివర్తించువాఁడు మోక్షమును తప్పక పొందును-

ఉభౌ లోకౌ విద్యయా వ్యాప్యయాన్తి

తదా హుతం చానాహుత మగ్నిహోత్రమ్ ॥౧౫॥
మా తే బ్రాహ్మీం లఘుతా మాదధీత
పరిజ్ఞానం స్యాన్నామ ధీరా లభన్తే ॥

విద్యయా వ్యాప్య- విద్యతో వ్యాపించియుండి, ఉభౌ లోకాయాన్తి= రెండు లోకములను పొందుచున్నారు- తదా అనాహుతమ్ అగ్నిహోత్రంచ హుతం (భవతి) = అప్పుడు హోమము చేయఁబడని అగ్నిహోత్రముగూడ హోమము చేయఁబడినది (అగుచున్నది)- తే బ్రాహ్మీం లఘుతామ్ మాదధీత= నీ బ్రహ్మవిద్య చులకదనమును పొందింపదు- పరిజ్ఞానం నామ స్యాత్= గొప్పజ్ఞానమనునది కావలయును- (తత్) ధీరాః లభన్తే= (దానిని) ధైర్యము కలవారు పొందుచున్నారు-

తా॥ బ్రహ్మజ్ఞానమువలననె ఇహలోకఫలంబులును పరలోకఫలంబులునుగూడ కలుగును- కాఁబట్టి అగ్నిహోత్రాదులను చేయకున్నను వానిఫలములను పొందుటచేత అగ్నిహోత్రాదులను ఆచరించినవాఁడె యగుచున్నాఁడు- బ్రహ్మవిద్య యెప్పుడును క్రమముగా వృద్ధినిబొందునుగాని హ్రాసమును పొందదు- ఆబ్రహ్మవిద్యను మనో ధైర్యముకలవారె పొందుదురు-

ఇచ్చట శంకరభాష్యమున చులకదనమును పొందింపదుఅను దానికి ఇఁక మనుష్య జన్మమును కలుగనీయదు అని తాత్పర్యము వ్రాయఁబడినది-

ఏవం రూపో మహానాత్మా పావకం పురుషో గిరన్ ॥౧౬॥
యో వైతం పురుషో వేద తస్యేహాత్మా న రిష్యతే॥

ఏవంరూపః మహాన్ ఆత్మా = ఇట్టిస్వరూపముగల గొప్ప ఆత్మ, పావకం గిరన్ పురుషః = అగ్నిని మ్రింగుచున్న పురుషుఁడు - యః పురుషః తం వేద - ఏ పురుషుఁడు ఆతనిని తెలిసికొనునో, ఇహ తస్య ఆత్మా నరిష్యతే - ఈలోకమున ఆతని ఆత్మ చెడదు-

తా॥ పరమాత్మనసన్దృశేతిష్ఠతి (౯ శ్లో॥) ఇత్యాది శ్లోకములలోఁ జెప్పఁబడిన స్వరూపము కలవాఁడు - ఆతఁడె ప్రళయకాలమున జగత్తును సంహరించువాఁడు - ఎవ్వఁడు ఆ

తనని తెలిసికొనునో వానియాత్మయె ఈలోకమున చెడని ఆత్మ

తస్మాత్సదా సత్కృతం స్యాన్న మృత్యురమృతంకుతః॥౧౭
తస్మాత్ సదా సత్కృతం స్యాత్ = అబ్రహ్మజ్ఞానము వలన ఎ
ప్పుడును మేలు కలుగును - మృత్యుః న( స్యాత్ ) = మృత్యువు
కలుగదు - అమృతం కుతః ( స్యాత్ ) = స్వర్గానుభవము ఎట్లు
లుగును -

తా॥ బ్రహ్మజ్ఞానమువలన మోక్షము కలుగును - అందువల
చచ్చిపుట్టుటకాని అనిత్యములగు స్వర్గాదుల ననుభవించుటకాని
లుగదు -

సత్యానృతే సత్యసమాన బన్ధనే
సతశ్చ యోని రసతశ్చైకఏవ।
సత్యానృతే సత్యసమానబన్ధనే ( భవతః ) = చేతనాచేతనముల
పరబ్రహ్మముతోడసమానమయినసంబంధముకలవి ( అగుచున్నవి
సతశ్చ అసతశ్చ యోనిః ఏకఏవ = జీవులకును అచేతనములకున
కారణమైనవాఁడు ఒక్కఁడె -

తా॥ చేతనాచేతనములు రెండును ఈశ్వరునివె - ప్రకృతి
తోఁ జేరియున్న ఈచేతనులకు సృష్టిస్థితి సంహారములు కలుగ
జేయువాఁడు ఆపరమాత్మయె -

అదర్శనే తిష్ఠతి రూపమస్య
పశ్యన్తి చైనం సుసమిద్ధసత్త్వాః। ౧౮॥
హీనో మనీషీ మన సాఽభిపశ్యే
ద్య ఏనం విదు రమృతాస్తే భవన్తి।
అస్య రూపమ్ అదర్శనే తిష్ఠతి = ఈపరమాత్మయొక్క స్వరూ
ము చూడశక్యముగాని స్థితిలోను ఉన్నది- సుసమిద్ధసత్త్వాశ్చ ఏన
పశ్యన్తి = లెస్సగాఁ బ్రకాశింపుచున్నట్టియంతఃకరణములుగలవారు
ఈతనిని చూచుచున్నారు - హీనః మనీషీ మనసా అభిపశ్యేత్ =
రాగద్వేషాదులులేని పరిశుద్ధాంతఃకరణుఁడు మనస్సుచేత చూచ
ను - యే ఏనం విదుః = ఎవ్వరు ఈతనిని తెలిసికొందురో ,
అమృతాః భవన్తి = వారు ముక్తులు అగుచున్నారు -

తా॥ ఈతని స్వరూపమును మనము చూడలేము - అయినను పరిశుద్ధాంతః కరణులు ఈతనిని సాక్షాత్కరింపుచున్నారు- కాఁబట్టి రాగద్వేషాదులులేని మనస్సుచేత చూడఁబడఁ దగినవాఁడె - ఇట్లు ఈపరమాత్మను తెలిసికొనెడివారు ముక్తులు అగుదురు-

ఇమం యస్సర్వభూతేషు చాత్మాన మనుపశ్యతి ॥౧౯॥
అన్యత్రాఽన్యత్ర యుక్తేషు కిం సశోచేత్తతః పరమ్ ।

త్ర అన్యత్ర యుక్తేషు సర్వభూతేషు = మఱియొకచోటను ఱియొకచోటను చేరియున్న అన్నిభూతములయందును , యః మమ్ ఆత్మానమ్ అనుపశ్యతి = ఎవ్వఁడు ఈ ఆత్మను ధ్యానముచేయుచున్నాఁడో , సః తతః పరమ్ శోచేత్కిమ్ = వాఁడు అటపైని చారించునా?

తా॥ ఒక్కచోటనే యుండక అంతట చెదిరి యున్న ఈ భూతములయం దన్నిటియందును వ్యాపించియున్న పరమాత్మను ఎల్లప్పుడును ధ్యానము చేయుచున్నవానికి ఏదుఃఖమును కలుగఁబోదు -

అన్యత్ర అన్యత్ర యుక్తేషు అనుదానికి , దేహముఇంద్రియములు మొదలగువానిని ఆత్మగా భావించెడి , అనిశంకరభాష్యమునవ్యాఖ్యానము చేయఁబడినది.

యథోదపానే మహతి సర్వత స్సంప్లుతోదకే ॥౨౦॥
ఏవం భూతేషు సర్వేషు బ్రాహ్మణస్య విశేషతః ।

సర్వతః సంప్లుతోదకే మహతి ఉదపానే= అంతట నిండియున్న నీరుగల గొప్పతటాకమున , యథా = ఎట్లో , బ్రాహ్మణస్య సర్వేషు భూతేషు విశేషతః తథా(భవతి)=బ్రహ్మజ్ఞానికి అన్నిభూతములయదును విశేషముగా అట్లై (అగుచున్నది-)

తా॥ నీటితో నిండియున్న తటాకములో ఎచ్చటనునులోటులేకుండ నీరు ఎట్లు నిండియుండునో అట్లు అన్నిభూతములయందున్నపరమాత్మ నిండియున్నాఁడనిబ్రహ్మజ్ఞానికి తెలియును-

ఇచ్చటశంకరభాష్యమున, పెద్దచెరువువలన ఎట్లు ప్రయోజనములేదో , అట్లెబ్రహ్మజ్ఞానికి సమస్తభూతములవలనను ఏమి

యున: ప్రయోజనము లేదని తాత్పర్యము చెప్పబడినది-

అహమేవాస్మి నో మాతా పితా పుత్రోఽస్మ్యహం పునః ॥౧॥
ఆత్మాహ మస్య సర్వస్య యచ్చ నాస్తి యదస్తి చ
పితామహోఽస్మి స్థవిరః పితా పుత్రశ్చ భారత ॥౨॥
మమైవ యూయ మాత్మస్థా న మే యూయం న చాప్యహమ్।

వః మాతా అహమేవ అస్మి= మీకుతల్లిని నేనె అనుచున్నాను
పితా అస్మి= తండ్రిని అనుచున్నాను. అహం పునః పుత్రః అస్మి
నేను తిరిగియు కొడుకును అనుచున్నాను- యచ్చ నాస్తి=ఏశరీ
రము లేకున్నదో, యచ్చ అస్తి = ఏశరీరము ఉన్నదో, అస్య సర్వ
స్య ఆత్మా అహమ్ అస్మి = దీనికి అంతటికిని ఆత్మను నేను అను
చున్నాను - స్థవిరః పితామహః అస్మి = ముసలివాడనైన తాత
ను అనుచున్నాను - ( హే ) భారత పితా పుత్రశ్చ అస్మి = (ఓ)
భరతవంశపువాడా తండ్రియును కొడుకును అనుచున్నాను - ఆ
త్మస్థాః యూయమ్ మమైవ (భవథ) = పరమాత్మస్థగల వారు
నావారలె ( అనుచున్నారు -) యూయం మే న( భవథ ) = మీ
రు నావారలు కారు - అహంచాపి ( యుష్మాకం ) న భవామి =
నేనును ( మీవాడను ) కాను -

తా॥ ఒక్కజీవుడె ఒక్కజన్మమున తల్లియును ఒక్కజన్మ
మున తండ్రియును ఒక్కజన్మమున కొడుకును అనుచున్నాడు -
ఇట్లుండెడి తన శరీరమునకును తానెట్లు ఆత్మయై యున్నాడో
అట్లెగతించిన శరీరములకును రాబోవు శరీరములకును గూడ ఆత్మ
యై యున్నాడు - ఆజీవుడె ముసలివాడైన తాతయును తండ్రి
యును కొడుకును గూడ జన్మభేదములను పట్టి అనుచున్నాడు- పర
మాత్మయొక్క సంబంధమును పట్టి చూచినయెడను అందరును పర
మాత్మసంబంధులె కాన ఒకరికొకరు సంబంధులు కారు- మ
నయాత్మస్వరూపములను పట్టి చూచినయెడను మన శరీరములను ప
ట్టి వచ్చెడుసంబంధము సుతము ఆత్మకు లేదుగాన ఒక్కయాత్మకు
ను మరియొకయాత్మకును సంబంధము ఏదియు లేదు-

సనత్సుజాతుడు మనబోటి సంసారి కాకున్నను సంసారుల

యనుభవమును తనయందారోపించికొని ఆత్మస్వరూపమును బోధపడుచున్నాఁడని యెఱుంగునది-

ఆత్మైవ స్థానం మమ జన్మ చాత్మా
ఓతః ప్రోతోఽహ మజర ప్రతిష్ఠః ॥ ౨౩ ॥
అజశ్చరో దివారాత్ర మతన్ద్రితోఽహం
మాం విజ్ఞాయ కవిరాస్తే ప్రసన్నః ।

మమ ఆత్మైవ స్థానమ్ = నాకు పరమాత్మయె స్థానము - మమ జన్మ చ ఆత్మా=నా పుట్టుకకు కారణంబును పరమాత్మయె, అజర ప్రతిష్ఠః అహమ్ = కొంచెమును జారని నిలుకడగల నేను, ( ఆత్మని ) ఓతః ప్రోతశ్చ = (ఆత్మయందె) ఓతుఁడను ప్రోతుఁడనునై యున్నాను - అజః అహమ్ = మఱిపుట్టుకలేని నేను - దివారాత్రిమ్ అతన్ద్రితః చరః ( భవామి ) = పగలును రాత్రియును సోమరితనములేనివాఁడనై సంచరించువాఁడను (అగుచున్నాను)- మాం విజ్ఞాయ కవిః ప్రసన్నః ఆస్తే = నన్ను తెలిసికొని సర్వజ్ఞుఁడు ప్రసన్నుఁడై యున్నాఁడు -

తా ॥ నాకు పరమాత్మతప్ప మఱియేదియును అక్కఱలేదు. కావున నేను బట్టలో నూలు పడుగుపేకలుగానుండునట్లు పరమాత్మయందె పడుగుపేకలుగా నున్నవాఁడను - రాత్రింబగల్లు విషయాంతర ప్రసక్తిలేక జాగ్రత్తతో ప్రవర్తించుచుందును - కావున మఱి నేను పుట్టవలసిన ప్రసక్తి లేదు - నన్ను ఇట్టివానిగా తెలిసికొని పరమేశ్వరుఁడు నాయెడను అనుగ్రహము కలవాఁడై యున్నాఁడు -

అణో రణీయాన్ సుమనా స్సర్వభూతేషు జాగ్రతి ॥ ౨౪ ॥
పితరం సర్వభూతేషు పుష్కరే నిహితం విదుః ॥

అణోః అణీయాన్ = సూక్ష్మమైనదానికంటె మిక్కిలి సూక్ష్మమైనవాఁడును, సుమనాః ( ఆత్మా ) = మంచిసంకల్పముకలవాఁడును ( పరమాత్మ ), సర్వభూతేషు జాగ్రతి = అన్నిప్రాణులయందును మేలుకొనియున్నాఁడు, పితరం ( తమ్ ) సర్వభూతేషు పుష్కరే నిహితం విదుః = అన్నింటికిని తండ్రియైన ( యాతని )

అన్ని భూతములయందును హృదయమునందు ఉన్నవానిగా తెలిసి కొందురు -

తా॥ పరమాత్మ అతిసూక్ష్మవస్తువులలోఁ గూడవ్యాపించి యున్నవాఁడు- సత్య సంకల్పుఁడు- అన్నిప్రాణుల హృదయముల లోను నంతర్యామియై యుండును - ఆతండె అన్నిటిని సృజించిన వాఁడుగాన అన్నిటికిని తండ్రి -

ఇత్యుద్యోగ పర్వాన్తర్గత సనత్సుజాతపర్వణి పఞ్చచత్వారింశోధ్యాయః ॥

ఇట్లు ఉద్యోగపర్వములోని సనత్సుజాతపర్వమున నలుబదియైదవ యధ్యాయము -

సనత్సుజాతపర్వము

సమాప్తము-